శ్రీమతే రామానుజాయ నమః

**'న్యాయవేదాంత విద్వాన్' ఉ.వే.శ్రీమాన్
కార్పంగాడు వేంకటాచార్యస్వామివారు
అనుగ్రహించిన**

# సీతాచరితమ్



**ఆంధ్రానువాదం:**

**'పండిత రత్న' ఉ.వే.శ్రీమాన్
ఈయుణ్ణి అళగ శింగరాచార్యస్వామి వారు**

**సంపాదకుడు:**

**ఈయుణ్ణి అనంత రంగ రామన్**

**10,జూలై, 2021**

# అవతారిక

భారతీయ సాహిత్యంలో శ్రీరామాయణానికి ఉండే స్థానం ఇంకొక గ్రంథానికి లేదు. శ్రీ రామ చరిత్ర భారతీయుల దైనందిన జీవితంలో ఒక భాగమైపోయింది. శ్రీ రామాయణ ప్రభావం మన దేశంలోనే కాక, ఇతర దేశాలలో కూడా చాలాచోట్ల వ్యాపించింది.

ఎన్నో భాషలలోకి ఈ గ్రంథం అనువదింపబడి రసజ్ఞులైన పాఠకులచే ఆదరింపబడుతున్నది. ఎంతోమంది కవులు తమ కావ్యాలను రామ చరిత్ర ఆధారంగా చేసుకొని రచించారు. మరి ఎంతమందో విమర్శకులు శ్రీరామ- చరిత్రలోని పలు అంశాలను రసరమ్యంగా విమర్శించి తెలియజేశారు. శ్రీరామ చరిత్ర నిజానికి భారతదేశం సొత్తు మాత్రమే కాదు, ప్రపంచానికి సంబంధించిన అమూల్యమైన సాంస్కృతిక సంపద.

గడచిన శతాబ్దిలో తమ మధురమైన ఉపన్యాసాలతో ఆసేతుహిమాచలం ఆస్తిక శ్రోతలను ఉఱ్ఱూతలూగించిన మహోపన్యాసకులు **న్యాయ వేదాంత విద్వాన్ శ్రీమాన్ కారప్పంగాడు వేంకటాచార్యస్వామివారు.** వీరు చేసిన ఉపన్యాసాలు ఆనాడు ఆస్తికులకే కాక విమర్శకులకు కూడా ఆకర్షణీయంగా ఉండేవి. ఎన్నో సాంప్రదాయిక, సిద్ధాంత, సాహిత్యాంశాలపై వీరు అమూల్యమైన ఉపన్యాసాలు అందించారు.

ఆ ఉపన్యాసాలలో కొన్నిటిని వారి శిష్యులు, ప్రశిష్యులు, అభిమానులు కొంతమంది అక్షర రూపంలో తీసుకొనివచ్చారు. అవి అన్నీ తమిళ భాషలో ఉన్నాయి. అవి ఆంధ్రదేశంలోని జిజ్ఞాసువులకు అందాలంటే వాటికి తెలుగులో అనువాదం రావాలి. ఆ ప్రయత్నంలో ఒక భాగమే ఈ గ్రంథం.

'శ్రీ రామాయణానికి సీతా చరితం, రఘువర చరితం, రావణ వధ అనే మూడు పేర్లు ఉన్నాయి' అని కవి వాల్మీకి తెలియజేశాడు. ఇందులో ముఖ్యమైనది **'సీతా చరితం'** అనే పేరు. 'సీతాదేవి చరిత్రయే శ్రీ రామాయణం' అని మన పూర్వాచార్యుల అభిప్రాయం. శ్రీమాన్ వేంకటాచార్య స్వామి ఈ గ్రంథంలో శ్రీరామాయణంలో గోచరించే సీతాదేవి వైభవాన్ని తమదైన శైలిలో అందించారు. సీతాదేవికి కలిగిన మూడు వియోగాలలోని రహస్యం, జీవుని విషయంలో ఆమె చేసే పురుష కారం, ఇంకా ఆమె చరిత్రలోని పలు అంశాలు ఈ గ్రంథంలో ప్రస్తావింపబడ్డాయి. ఇవి అన్ని సీతావైభవాన్ని మధురంగా తెలియజేస్తున్నాయి. ఈ గ్రంథం ఆంధ్రదేశంలోని ఆస్తిక పాఠకులకు ఆనందాన్ని కలిగిస్తుందని నమ్ముతున్నాను. అనువాదంలోని దోషాలను సహృదయులైన పాఠకులు మన్నిస్తారని భావిస్తాను. ఈ గ్రంథాన్ని సిద్ధం చేయడంలో సహకరించిన కుమారుడు చిరంజీవి శ్రీమాన్ అనంతరంగ రామన్ కు అనేక మంగళాశాసనాలు. స్వస్తి.

**సీతాచరిత్రం మధురం పవిత్రం**
**శ్రీవేంకటాచార్యముఖాబ్జజాతమ్,**
**భవ్యం మరందం విబుధాళితృప్త్యై**
**సమర్పయామీహ కృతాంజలి స్సన్.**



భవదీయుడు,
**ఈ.ఏ.శింగరాచర్యులు**





'న్యాయవేదాంత విద్వాన్' ఉ.వే.శ్రీమాన్

**కార్పంగాడు వేంకటాచార్యస్వామివారు**

# విషయ సూచిక

**శ్రీమతే రామానుజాయ నమః**
**శ్రీమద్వరవరమునయే నమః**

# సీతాచరితమ్

శ్రియఃపతి అయిన సర్వేశ్వరుడు ఈ లోకంలోని మనవంటి జీవాత్మల క్షేమాన్ని మనస్సులో పెట్టుకొని లెక్కలేనన్ని అవతారాలను ఎత్తాడు. ఉన్నతస్థానంలో ఉండేవాడు కిందకు దిగి రావడానికి 'అవతార'మని పేరు. శ్రీకృష్ణుడు గీతలో అర్జునునితో "**బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున**" (అర్జునా! నీకు ఏవిధంగా పలు జన్మలు కలిగాయో, ఆ విధంగానే నేనుకూడా పలు అవతారాలను ఎత్తాను. నీ జన్మలు కర్మలవల్ల ఏర్పడగా నా అవతారాలు నా ఇచ్ఛ వల్ల ఏర్పడ్డాయి) అని అన్నాడు.

ఆ విధంగా భగవానుడవతరించినపుడంతా ఆస్వామి దివ్యమహిషి అయిన లక్ష్మీదేవివి ఆయా అవతారాలకు అనుగుణంగా తానుకూడా స్వామితో పాటు అవతరిస్తుంది. "**దేవత్వే దేవదేహేయం మనుష్యత్వే చ మానుషీ**" అని విష్ణుపురాణం ఈ విషయాన్ని తెలిపింది. అతడు దేవుడై అవతరిస్తే ఈమె దేవకాంతగా అవతరిస్తుంది. అతడు మానవుడుగా అవతరిస్తే ఆమెకూడా మానవస్త్రీగా అవతరిస్తుంది. భగవానుడు వామనావతారంలో బ్రహ్మచారిగా అవతరించినపుడుకూడా ఆమె "**కృష్ణాజినేన సంవృణ్వన్**" అనేవిధంగా వామనుడు తన వక్షఃస్థలంలో కప్పుకొన్న కృష్ణాజినంలో రహస్యంగా వ్యక్తం కాకుండా ఉన్నది.

# మొదటి భాగం

## ఒక మిథునమే మనకు రక్షకం:

భగవానుడు, లక్ష్మి – అనే దివ్యమిథునమే మనకు అనిష్టనివృత్తి–ఇష్టప్రాప్తిరూపమైన రక్షణను కలిగిస్తారు. శ్రీరామాయణంలో "**రాఘవత్వేఽభవతీ్సతా**" అనే విధంగా భగవానుడు రాముడై అవతరించినపుడు లక్ష్మీదేవి సీతాదేవియై అవతరించింది. సీత తల్లి గర్భవాసం నుండి కాకుండా భూమినుండి అవతరించింది. ఇంతేకాక, యుద్ధం పూర్తి అయిన తరువాత దేవతలు సీతాదేవిని మహాలక్ష్మి స్వరూపిణిగానే కీర్తించడం కూడా మనం గమనించవచ్చు. ఇందువల్ల లక్ష్మీదేవియే సీతాదేవిగా అవతరించింది–అనే విషయం స్పష్టపడుతున్నది.

శ్రీరామాయణం సీతాచరితమ్. వాల్మీకి భగవానుడు **"కావ్యం రామాయణం కృత్స్నం సీతాయా శ్చరితం మహత్" (శ్రీరామాయణ కావ్యమంతా సీతాదేవి యొక్క గొప్ప చరిత్ర)** అని శ్రీరామాయణానికి "**సీతాచరితమ్**" అనే అద్వితీయమైన పేరును పెట్టాడు.

లోకంలో ఒకనికి అన్ని అవయవాలు అవసరమైనా, వాటన్నిటిలో కన్నులు అనేవి చాలా ముఖ్యమైనవి. కన్నులు రెండూ ముఖ్యమైనవే అయినా వాటిలో ఎడమకన్ను కంటే కుడికన్ను చాలా ప్రధానమైనది. ఆ విధంగానే, భగవానుని రక్షకత్వం కంటే లక్ష్మీదేవి రక్షకత్వం చాలా ముఖ్యమైనది.

నిరుపాధికమాత అయిన లక్ష్మీదేవికి వాత్సల్యం లో ప్రాధాన్యం ఉన్నది. భగవానునకు పితృత్వంలో ప్రాధాన్యం

ఉన్నది. అతని పితృత్వం మాతృత్వంతో కలసి ఉంటుంది. అంటే–మనం చేసిన కర్మలను బట్టి అతడు నిగ్రహాన్ని గాని అనుగ్రహాన్ని గాని చూపిస్తాడు. లక్ష్మీదేవి మాత్రం **“అజ్ఞాత నిగ్రహా” (కోపం తెలియనిది)** అనే రీతిలో కేవలం వాత్సల్యం మూర్తీభవించినట్లుగా ఉంటుంది. అందువల్ల మాతృత్వం ఆమెకు సహజమైన స్వరూపం.

ఈ విషయాన్ని ప్రతిపాదించడంలోనే శ్రీరామాయణం దృష్టి కలిగి ఉన్నది. దీనికి అనుగుణంగానే శ్రీరామాయణంలో శ్రీరాముని చరిత్ర వివరింపబడింది. **“శ్రీ రామాయణత్తాలే శిఱై యిరున్దవళ్ ఏఱ్ఱమ్ శొల్లుకిఱదు**" (శ్రీరామాయణం ద్వారా చెరలో ఉన్న సీతాదేవి గొప్పదనం చెప్పబడుతున్నది) అనేది శ్రీపిళ్ళైలోకాచార్యులవారి సూక్తి. శ్రీ పరాశర భట్టర్ కూడా **"శ్రీమద్ రామాయణ మపి పరం ప్రాణితి త్వచ్చరిత్రే"** – ‘తల్లీ! శ్రీ రామాయణం కూడా నీ వైభవాన్ని తెలియజేయడంలోనే ప్రధానమైన దృష్టిని కలిగినది’–అని అనడం గమనించవచ్చు. ఇక్కడ ‘శ్రీమద్’ అనే పదం ద్వారా లక్ష్మీదేవి సంబంధం చెప్పబడింది. ‘పరమ్’–అనే పదం ద్వారా ‘సీతా చరిత్ర వర్ణింపబడడం వల్ల మహాభారతం కంటే శ్రీరామాయణం విలక్షణమైనది’ అని చెప్పబడింది. ఏ విధంగా అంటే–లక్ష గ్రంథ పరిమితి కలిగిన మహాభారతాన్ని వ్యాస మహర్షి రచించినా ఆయనకు మనస్సులో తృప్తి కలుగలేదు. అది అంతా అల్పులైన రాజుల చరిత్రను, వారి యుద్ధాన్ని వర్ణించేది. అటువంటి దోషం శ్రీ రామాయణంలో లేదు. అందుచేత శ్రీరామాయణం భారతం కంటే గొప్పది అని తెలుస్తున్నది . భారతం రచించిన తరువాత కూడా తృప్తి కలుగనందువల్లనే వ్యాసమహర్షి భగవానుని చరిత్రను తెలిపే హరివంశాన్ని రచించాడు. అందువల్ల మహాభారతం కంటే శ్రీ రామాయణం గొప్పది అనేది స్పష్టమవుతున్నది.

"అపి" అనే పదం ద్వారా శ్రీ సూక్తం మాత్రమే లక్ష్మీదేవి వైభవాన్ని వర్ణించలేదు, శ్రీ రామాయణం కూడా ఆమె వైభవాన్ని విస్తృతంగా తెలుపుతున్నది–అని తెలుపబడింది. ఈ విధంగా వాల్మీకి, పరాశరభట్టర్, శ్రీపిళ్ళై లోకాచార్యులవారు పలికిన రీతిలో శ్రీ రామాయణం అనే పేరు ఉన్నా, సీతా చరిత్రమే ఆ గ్రంధంలో ప్రధానంగా ప్రకాశిస్తూ ఉన్నది–అని తెలుస్తున్నది.

కొన్ని వాక్యాలలో వాచ్యార్థం, ధ్వన్యర్థం–అనే రెండు రీతులలోని అర్థాలను గమనించవచ్చు. ఆ విధంగా చూచినపుడు, శ్రీ రామాయణంలో పైపైన చూస్తే శ్రీరాముని చరిత్ర గోచరించినా, అందులో నిశితంగా పరిశీలిస్తే, ఆ గ్రంథంలో జీవనాడిగా సీత చరిత్ర ప్రకాశిస్తున్నది అని తెలుస్తుంది.

కావ్యాలను రచించేటప్పుడు కవులు ముందుగా ఒక శ్లోకంలో ప్రధానమైన అర్థాన్ని సంగ్రహంగా పలికి, తరువాత ఆ అర్థాన్ని కావ్యంలో వివరించడం అనేది సంప్రదాయం. 'ఓం' అనే ప్రణవంలో సకల వేదార్థాలు అణిగి ఉన్నాయని వైదికులు అందరూ ఏకగ్రీవంగా ఒప్పుకుంటారు. ప్రణవంలోని అక్షరాలలో మొదటి అక్షరం 'అ'కారం ఇందులో అన్ని వేదార్థాలు ఇమిడి ఉన్నాయి–అని శ్రీవైష్ణవులు భావిస్తారు. ఆ విధంగానే శ్రీ రామాయణంలో కూడా మొదట ఉండే శ్లోకంలో శ్రీ రామాయణంలోని సకలార్థాలు అణగి ఉన్నాయని అంటారు.

శ్రీ వాల్మీకి మహర్షి స్నానం చేయడం కోసం శిష్యులతో కలసి తమసా నదీ తీరానికి వెళ్ళాడు. అప్పుడు ఆ నదీ తీరంలో ఉండే ఒక చెట్టుపై ఒక క్రౌంచ పక్షుల జంట ఆనందిస్తూ ఉన్నది. ఇంతలో ఒక వేటగాడు అక్కడకు వచ్చి, ఆ జంటలోని మగ పక్షిని బాణంతో కొట్టి వధించాడు. ఆడ పక్షి దుఃఖంతో ఆక్రందన చేసింది. ఆ సందర్భాన్ని వాల్మీకి మహర్షి చూచి చాలా బాధపడి,

ఈ విధంగా ఆ వేటగానిని శపించాడు. "**మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమః శాశ్వతీః సమాః, యత్క్రౌంచమిథునాదేక మ వధీః కామమోహితమ్**". ఈ శాపమే ఒక శ్లోకంగా అవతరించింది. "ఓరీ! నిర్భాగ్యుడా! ఆనందంగా విహరిస్తున్న ఈ క్రౌంచ పక్షులలో ఒక పక్షిని నీవు వధించావు. అందువల్ల నీవు చిరకాలం జీవించవు" అనేది ఈ శ్లోకంలో పైపైన గమనించినప్పుడు తెలిసే అర్థం. ఇది వాచ్యార్థం.

అయితే దీనిలోని ధ్వన్యర్థం రామాయణార్థసంగ్రహంగా , దానికి మంగళశ్లోకంగా గోచరిస్తుంది. "మా– మహాలక్ష్మి, నిషాద–నివాసంచేసే శ్రీనివాసా!" అనేది 'మానిషాద' అనే పదంలోని అర్థం. లక్ష్మీపతీ! రావణుడు, మండోదరి అనే కామ మోహితులైన దంపతులలో రావణుని వధించిన నీవు చిరకాలం వర్ధిల్లాలి–అనేది ఈ శ్లోకంలోని ధ్వన్యర్థం.

శ్రీ రామాయణంలో తండ్రి, తనయుడు, భర్త, భార్య, స్వామి, దాసుడు–అని ఈ విధంగా ఉండే పలువురి ధర్మాలు ఏ విధంగా ఆచరింపబడాలో తెలియజేయబడ్డాయి. ఇవి పైపైన చూసినప్పుడు మనకు గోచరించే విషయాలు. కానీ ఇంతకంటే విలక్షణమైన అనేక అర్థాలు ఇందులో చెప్పబడ్డాయి. అందువల్లనే శ్రీ రామానుజులు 'తిరుమల నంబి' వద్ద ఒక సంవత్సరం కాలం శ్రీరామాయణంలో ఉండే 18 విధాలైన అర్థాలను విన్నారు – అని పెద్దలు తెలియజేశారు.

## ఉపాయత్వం–పురుషకారత్వం:

భగవానునకు ఉండే అసాధారణ ధర్మం 'ఉపాయత్వం'. అంటే–ఒక జీవునకు మోక్షం ఇచ్చే శక్తి., ఆ విధంగానే లక్ష్మీదేవికి ఉండే అసాధారణమైన ధర్మం పురుష కారకత్వం. అంటే, భగవానుడు అతనిని అంగీకరించేటట్లు చేసే గుణం. ఒకనిలో

ఉండే అసాధారణ ధర్మం అంటే-అది అతనిలో మాత్రమే కనిపించే గుణం. ఇతరులలో అది విలక్షణమైన ధర్మంగా కనిపించదు. 'ఉపాయత్వం' అనే ధర్మం భగవానునిలో తప్ప వేరు ఎవరిలోనూ చూడడానికి సాధ్యం కానిది. అందువల్ల అది భగవానుని అసాధారణ గుణం, ఆ విధంగానే పురుషకారత్వం కూడా లక్ష్మీ దేవికి గల విలక్షణ ధర్మం. కనుక అది ఆమెలోనే విశేషంగా కనిపిస్తుంది. మిగిలిన దేవేరులకు, ఆచార్యులకు ఉండే పురుషకారకత్వం అనేది ఈ లక్ష్మీదేవి వల్ల కలుగుతున్నది. అంటే ఆమె కార్యాన్ని వీరు చేస్తున్నారని భావం.

ద్వయం అనే మంత్ర రత్నంలోని " శ్రీ మత్" అనే పదం ద్వారా పురుష కారత్వంలోని ఆవశ్యకత, "ప్రపద్యే" అనే పదం ద్వారా పురుషుని ఆవశ్యకత చెప్పబడ్డాయి. భగవానుడు అనే ఉపాయానికి ఈ రెండు కావలసినవే.

## పురుషకారం అంటే ఏమి?:

**"పురుషం కరోతి ఇతి పురుషః"** అంటే–పురుషునిగా చేస్తున్నది–అని అర్థం. పురుషుడు అంటే ఎవరు?-అని అడిగితే, చేతనుడు ఒక పురుషుడు, 'పరమ చేతనుడు పురుషోత్తముడు' అనేది ఇంకొక అర్థం. భగవద్విషయంలో విముఖుడైన చేతనుని ఆ స్వామివిషయంలో ఆభిముఖ్యం పొందేటట్లు జీవుని, దోషాలతో నిండిన జీవుని అనుగ్రహించేటట్లు భగవానుని చేస్తున్నది. ఈ విధంగా ఈమె జీవుడు–పరమాత్మ అనే ఇద్దరిని సంస్కరించి పురుషులను చేస్తున్న ది. కనుక ఈమె చేసే కృత్యం పురుషకారం అనబడుతున్నది.

## పురుషకారత్వం:

ఆత్మ క్షేమం పొందడానికి భక్తి లేక ప్రపత్తి చేయవలసి ఉన్నది-అని వేదాంతశాస్త్రం తెలుపుతున్నది. ఇందులో 'శరణాగతి' అనే ప్రపత్తినే శ్రీ వైష్ణవ సంప్రదాయంలో ముఖ్యంగా స్వీకరిస్తున్నారు. ఈ ప్రపత్తిని చేసేటప్పుడు లక్ష్మీదేవిని పురుషకారంగా ఆశ్రయించడం క్రమం-అని ఆచార్యులు అందరూ ముక్తకంఠంగా అంగీకరిస్తున్నారు.

**"రాజాధి రాజ స్సర్వేషాం"** (రాజులందరికీ గొప్ప రాజు) అనబడే భగవంతుడు రాజాధిరాజు, సార్వభౌముడు. దానికి తగినట్లు ఎంతోమంది పత్నులు ఆ స్వామికి ఉన్నారు. 'పాంచరాత్రం' అనే శాస్త్రంలో శ్రీదేవి అనబడే లక్ష్మికే పురుషకారం అనే అసాధారణ ధర్మం ఉన్నది-అని స్పష్టంగా చెప్పబడింది.

## పురుషకారకృత్యం:

అపరాధాలతో నిండిన జీవుడు ఒకడు ఏదో ఒక జన్మలో ఒక ఆచార్యుని ఆశ్రయించి ఉపదేశాన్ని పొంది, అందువల్ల భగవంతుని పట్ల ఆసక్తి కలిగి భగవంతుని ఆశ్రయిస్తున్నాడు. అప్పుడు, భగవంతుడు స్వతంత్రుడు కనుక, తాను విధించిన శాస్త్ర క్రమాన్ని చూచి, ఆ జీవుని కర్మలకు తగినట్లు నిగ్రహించి అంగీకరించకుండా నిరాకరిస్తాడు. అప్పుడు స్వామి పక్కనే ఉండే లక్ష్మీదేవి భగవంతుని నిగ్రహాన్ని మార్చి జీవుని అనుగ్రహించేటట్లు చేస్తుంది. లక్ష్మీదేవి చేసే ఆ కృత్యమే పురుష కారకృత్యం, అంటే, పురుషకారం చేయడం-అనేది.

భగవంతుని స్వాతంత్ర్యం తలెత్తినప్పుడు దానిని తగ్గించి, అతనికి సహజంగా ఉండే క్షమ, దయ మొదలైన కళ్యాణ గుణాలను ప్రేరేపించడం లక్ష్మి చేసే పని. చేతనుని తన తగిన

ఉపదేశంతో, కృపతో మార్చి భగవంతుని ఆశ్రయించేటట్లు చేస్తున్నది. ఆ విధంగా ఆశ్రయించే జీవుని స్వీకరించి అనుగ్రహించేటట్టు భగవంతుని చేస్తున్నది.

లక్ష్మిని పురుషకారంగా చేసుకొని భగవంతుని ఉపాయంగా ఆశ్రయించాలి-అనేది తెన్నాచార్య సంప్రదాయం. లక్ష్మీదేవిని పురుష కారణంగాను, ఉపాయంగాను ఆశ్రయించాలి-అనేది ఇంకొక సంప్రదాయం. అయితే, స్వామి దేశికులు చతుఃశ్లోకి మూడవ శ్లోక వ్యాఖ్యానంలో "భగవంతుడే మోక్షాన్ని ఇస్తాడు, దానిని పొందేటట్లు ఘటకస్థానంలో లక్ష్మి ఉంటుంది" అని స్పష్టంగా పలకడం మనం గమనించవచ్చు.

ఇంతేకాక కొందరు "మనం లక్ష్మిని ఆశ్రయిస్తేనే మనకు ఆ లక్ష్మీదేవి కరుణిస్తుంది" అని అంటున్నారు. అయితే, మనం లక్ష్మీదేవిని ఆశ్రయించినా, ఆశ్రయించక పోయినా ఆమె మనను కరుణిస్తుంది అనేది తెన్నాచార్య సంప్రదాయం. దీనిని సీతాదేవి కాకాసురని విషయంలో, రాక్షస స్త్రీల విషయంలో వ్యక్తం చేయడం స్పష్టంగా గమనించవచ్చు.

## పురుషకార గుణాలు:

ఈ విధంగా పురుషకారం చేయడంకోసం లక్ష్మి దగ్గర ఉండవలసిన గుణాలు మూడు. అవి ఏవి? అంటే, కృప, పారతంత్ర్యం, అనన్యార్హత్వం అనేవి. వీటిలో కృప అనేది పురుషకారం చేయడంలో స్వరూపం లో ఉపయోగపడుతున్నది. మిగిలిన రెండు, పారతంత్ర్యం, అనన్యార్హత్వం అనేవి. ఈ మూడు గుణాలు లక్ష్మీదేవి అవతారమైన సీతాదేవిలో ఉన్నవి-అనే విషయం శ్రీరామాయణంలో వివరింపబడింది.

## కృప:

ఇతరుల కష్టాన్ని చూస్తే 'అయ్యో!' అని జాలి పడటం కృప అనబడుతుంది. ఈ గుణం సీతాదేవిలో ఉన్నది కనుక తాను సంసారి జీవుని కష్టాన్ని చూచి సహించలేక జాలితో భగవంతుని పట్ల విముఖుడై ఉండే చేతనునకు ఉపదేశం చేయడం ద్వారా, అతనిని కరుణించడం ద్వారా సంస్కరించి, భగవానుని విషయంలో భక్తి కలిగి ఉండేటట్లు చేసి, అతడు భగవంతుని ఆశ్రయించేటట్లు చేస్తున్నది. మాతృత్వ ప్రయుక్తమైన కృప మన విషయంలో లక్ష్మీదేవికి పూర్తిగా ఉన్నది. "**దేవ్యా కారుణ్య రూపయా**" అని కరుణయే స్వరూపంగా కలిగినదికదా ఈమె.

## పారతంత్ర్యం:

పారతంత్ర్యం అంటే పరాధీనత. ఇతరుల కోరికకు తగినట్లు వారి ఇష్ట ప్రకారం ఉండడం. లక్ష్మీదేవి భగవానునకు స్వయంగానే తన ఇచ్ఛతోనే ఈ విధంగా పరతంత్రంగా ఉంటున్నది అని కొంతమంది అభిప్రాయం. అయితే ఈమె సహజంగానే, అంటే భగవంతునకు పత్నిగా ఉన్న కారణం చేత ఆ స్వామికి పరతంత్రగా ఉన్నది అని పిళ్ళైలోకాచార్యుల వారి అభిప్రాయం. ఇది ఆమెకు నిరూపక ధర్మం. ఈ విషయాన్ని కొంచెం వివరిస్తాను.

లోకంలో ఒకని శరీరం యొక్క ప్రవృత్తి నివృత్తులు ఆ శరీరాన్ని సొత్తుగా కలిగిన ఆత్మ అధీనంలో ఉంటాయి. అందువల్ల ఆ శరీరం ఆ జీవుని ఇష్టప్రకారం ఉపయోగపడే విధంగా ఉంటుంది. శరీరం జీవునకు పరతంత్రమై ఉంటుంది-అని అంటారు. ఇటువంటి స్థితిని మనం మనకు చెందిన భార్య, బిడ్డలు మొదలైనవారి పట్ల చూడలేము. శరీరం జీవునకు

పరతంత్రమై ఉండేటట్లు, జీవాత్మ యొక్క స్థితిగతులు అన్నీ పరమాత్మ అధీనంలో ఉన్నాయి. కనుక, జీవుడు భగవానునకు పరతంత్రుడు అనే విషయం తెలుస్తున్నది. ఈ విధంగా ఈ జగత్తు అంతా భగవంతునకు పరతంత్రమైన వస్తువు. ఆ విధంగానే లక్ష్మీదేవి కూడా భగవంతునకు పరతంత్రమైన వస్తువు. జగత్తులో ఆమె కూడా ఒకటిగా ఉన్నందున ఈ విధంగా చెప్పబడుతున్నది. దీనిని లక్ష్మీదేవి పాంచరాత్ర శాస్త్రంలో స్వయంగా "నేను వైష్ణవ శరీరాన్ని" అని అంటూ తనను విష్ణువునకు శరీరంగా తెలిపింది కదా. ఈ విధంగా లక్ష్మీదేవి తన స్వరూపం వల్లనే భగవంతునకు పరతంత్రురాలు అనే విషయం స్పష్టపడుతున్నది.

**"ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి"** (అర్జునా! భగవంతుడు అన్ని ప్రాణుల హృదయ ప్రదేశాలలో ఉన్నాడు) అని, భగవంతుడు సమస్త జగత్తుకు ఈశ్వరుడు, నియామకుడు అని చెప్పబడుతున్నది. లక్ష్మిని కలిపే ఇక్కడ **"సర్వభూతానాం"** అని చెప్పినందున లక్ష్మీదేవితో పాటు జగత్తులో ఉండే అన్నిటికీ భగవంతుడు ఈశ్వరుడు. ఈ విధంగా అతడు ఈశ్వరుడై ఉండడం స్వతస్సిద్ధం కనుక, "ఇది ఏ విధంగా వీలవుతుంది?" అనే ప్రశ్నకు అవకాశం లేదు.

అయితే, **"ఈశానా అస్య జగతః"** అనే శ్రుతిలో లక్ష్మీదేవి జగత్తును అంతటినీ పాలిస్తూ ఉన్నది అనే చోట ఏ విధంగా అర్థం నిర్వహించాలి? అనే ప్రశ్న కలుగుతుంది. దానికి సమాధానం చెప్పేటట్లుగా **"విష్ణుపత్నీ"**, అని వేదంలో ప్రయోగం ఉన్నది. భగవానునకు పత్నిగా ఉండడం చేత జగత్తును ఆమె నియమిస్తూ ఉన్నది–అని వేదం పలుకుతూ ఉన్నది. దీనివల్ల ఈమెకు భగవంతునకు పత్నిగా ఉండడంచేత ఏర్పడిన పారతంత్ర్యం ఉన్నది అనే విషయం స్పష్ట పడుతున్నది. ఈ విధంగా లక్ష్మీదేవి

స్వరూపం చేత పత్నిగా ఉండే సంబంధం చేత భగవంతునకు పరతంత్ర అనేది తెలుస్తున్నది.

## అనన్యార్హత్వం:

లక్ష్మీదేవి భగవంతునికి తప్ప ఎవరికి సంబంధించినది కాదు. భగవానునకు మాత్రమే చెందినది. ఈ విషయాన్ని ఆమె స్వయంగా "**అనన్యా రాఘవేణాహమ్**" అని పలికింది. ఈ విధంగా భగవంతునకు మాత్రమే చెందినది అయినందున ఈమె పలికే మాటను భగవంతుడు "నాకు ఈమె హితాన్ని చెబుతున్నది" అని నమ్మి ఏ చేతనుని విషయంలో అయినా ఈమె పురుషకారం చేసేటప్పుడు, ఆ జీవుని విషయంలో ప్రీతిని చూపించి ఆతనిని స్వీకరిస్తున్నాడు. దీనికి తగిన ధర్మమే అనన్యార్హత్వం.

ఈ విధంగా తనకే తగిన పురుషకారానికి తగిన మూడు గుణాలను సీతాదేవి కలిగి ఉండడాన్ని శ్రీరామాయణంలో మన పూర్వాచార్యులు వివరించి తెలియజేశారు .

అది ఏవిధంగా? అంటే, సీతాదేవి రాఘవుని విడచి మూడు సార్లు దూరమైనది. ఒక్కసారి ఒక్కొక్క గుణాన్ని ఆమె ప్రకాశింపజేసింది.

శ్రీరాముడు, లక్ష్మణుడు, సీత అనే ముగ్గురు దండకారణ్యంలో ఆనందంగా గడిపే సమయంలో 'రావణుడు సీతాదేవిని రామునకు దూరం చేశాడు' అనే ఒక నెపంతో ఆమె శ్రీరాముని విడచి లంకలో పది నెలలు నివసించింది.

## మొదటి విశ్లేషం:

పూవుకు సువాసన వలె, రత్నానికి కాంతి వలె ఎవరికీ విడదీయడానికి సాధ్యం కాని రీతిలో భగవానునితో కలసి ఉండే

తత్వం లక్ష్మి. అవతార దశలో రావణుడు ఆమెను రామునకు దూరం చేశాడు-అని అనడం భగవానుని దైవత్వానికి తగదు. తత్వం పరిచ్ఛిన్నం అవుతుంది. ఇంతేకాక భగవంతునివలే లక్ష్మి కూడా కర్మకు వశం కాదు. భగవంతునకు ఒక విధంగా కర్మవశ్యత్వాన్ని చెప్పవచ్చు. ఏ విధంగా? అంటే, జీవుడు చేసే ఆయా కర్మలను అనుసరించి భగవంతుడు అతనికి ఫలాన్ని ఇస్తాడు. అంటే, భగవానుడు ఇచ్చే ఫలం కర్మకు అనుసరించి కదా. కానీ, ఇటువంటి స్థితి లక్ష్మీదేవికి లేదు. ఏ విధమైన దోషం చెప్పడానికి అవకాశం లేనిది ఈమె. ఈమె దివ్యమైన తేజోరూప-మైనది. భగవానునినుండి ఏనాడు విడిపోనిది. నిత్యానపాయిని. ఆ విధంగా ఉండగా సీతాదేవికి వియోగం కలిగింది-అని అనడం ఏవిధంగా తగినది? అనే ప్రశ్న కలుగుతుంది.

అరణ్యంలో మాయామృగం వెంట వెళ్లిన రాముడు వెదకుతూ వెళ్లేటప్పుడు రాక్షసులు నిండిన ఆ అరణ్యంలో తాను ఒంటరిగా ఉండకుండా, రామునితో లక్ష్మణునితో తాను కూడా వెళ్లి ఉండవచ్చు కదా. ఆ విధంగా చేయలేదు.

ఇంతేకాక సీతకు "**కటిప్పెన్ కనలి**" అనే పేరు ఉన్నది. అగ్ని వలె పాతివ్రత్యంతో జ్వలించేది-అని దీని అర్థం. లంకలో హనుమంతుని తోకకు రాక్షసులు నిప్పు పెట్టినప్పుడు ఆ అగ్ని హనుమంతుని బాధించకుండా ఉండేటట్లు "**శీతో భవ హనూమతః" (హనుమంతునకు చల్లగా ఉండాలి)** అని పలికి హనుమానునకు అగ్నివల్ల బాధ లేకుండా చేసింది. రావణుడు తనను తీసికొని పోవాలని ప్రయత్నించినప్పుడు "నీవు భస్మం కావాలి" అని పలికి అతనిని నశింపజేసి ఉండవచ్చు.

అంతటి శక్తి కలిగిన సీత ఆ విధంగా రావణుని భస్మం చేయకుండా వియోగానికి సమ్మతించింది. రావణుడు ఆమెను

దూరం చేశాడు-అనే సాకుతో ఆమె లంకలో పది నెలల పాటు బంధింపబడి ఉండడానికి కారణం ఆమె కరుణయే.

భగవంతుని ఆశ్రయించిన దేవతల స్త్రీలను రావణుడు చెరలో పెట్టాడు. భగవంతుని ఆశ్రయించినవారి స్త్రీలు చెరలో ఉండగా తల్లి అయిన ఈమెకు సుఖంగా ఉండడం ఇష్టపడలేదు. వారిని చెరనుండి విడిపించడం కోసం ఈమె కూడా బందీ అయినది. తన బిడ్డ ప్రమాదం వల్ల బావిలో పడిపోతే ఆ బిడ్డను బయటకు తీయడం కోసం తల్లి ఏ మాత్రం సందేహించకుండా ఆ బావిలోకి దూకి  బిడ్డను బయటకు తీయడానికి ప్రయత్నం చేస్తుంది. ఆ విధంగానే దేవకాంతలపై ఉండే ప్రేమ కారణంగా సీతాదేవి కూడా బందీగా ఉండడానికి ఇష్టపడింది. ఈ విషయాన్ని నమ్మాళ్వార్ల 'తిరువాయ్ మొళ్ళి' ప్రబంధంలో **"తని చ్చిఱైయిల్ విళప్పుఱ్ఱ కిళిమొళియాళ్"** (అద్వితీయమైన చెరలో గొప్ప ప్రకాశాన్ని పొందిన, చిలుక వలె తీయగా పలికే సీతాదేవి) అని కీర్తించారు.

ఈ విధంగా లక్ష్మీ స్వరూపిణి అయిన సీతాదేవి తన కృపను శ్రీరామునకు దూరమైన మొదటి వియోగం ద్వారా శ్రీరామాయణంలో వ్యక్తం చేసింది-అని మన పూర్వాచార్యులు భావించారు.

## రెండవ విశ్లేషం:

శ్రీ రాముడు వనవాసం నుండి అయోధ్యకు తిరిగివచ్చి పట్టాభిషేకం చేసుకొని రాజ్యాన్ని పరిపాలించే కాలంలో అందరూ అతని గుణాలను పలు విధాలుగా కీర్తించి ఆనందించారు. అయినా, తనను గురించి ఎవరైనా చెడ్డగా పలుకుతున్నారా?-అని తెలుసుకోవడం కోసం రాత్రివేళ నగర శోధనను చేసే వేగుల ద్వారా

ఒక చాకలివాడు పలికిన మాట రాముని చెవిలో పడింది. దానికి పరిహారంగా ఏమి చెయ్యాలి?-అని ఆలోచించాడు, రాముడు.

ఆ సమయంలో సీతాదేవి గర్భవతి. ఆమెను చూచి శ్రీరాముడు "నీవు గర్భవతిగా ఉన్నావు కదా. ఇప్పుడు నీకు ఇష్టమైనది ఏమి?" అని అడిగాడు. "నా వంశాన్ని సంతానాన్ని కనడం ద్వారా నిలబెడుతున్నావు. ఇప్పుడు నీకు ఇష్టమైనది ఏదో చెబితే దానిని నేను నెరవేరుస్తాను" అని ఆమెను ప్రశ్నించాడు. **"ఆపత్యలాభో వైదేహి మామాయం సముపస్థితా, కిమిచ్ఛసి సకామా త్వం బ్రూహి సర్వం వరాననే"** – 60 వేల సంవత్సరాల పాటు సంతానం లేకుండా బాధపడి తరువాత సంతతిని పొందిన నా తండ్రి వలే కాకుండా, లాభంగా నాకు సులభంగానే నాకు సంతాన లాభం కలిగింది. అనుభవించి తీరాలి అనే ఆశ మీకు ఏదైనా ఉంటే దానిని చెప్పు, నేను తీరుస్తాను అని రాముడు అన్నాడు. అప్పుడు సీతాదేవి ఈ విధంగా బదులు చెప్పింది **"తపోవనాని పుణ్యాని ద్రష్టుమిచ్ఛామి రాఘవ ,గంగాతీరనివిష్టాని ఋషీణాః పుణ్యకర్మణామ్, ఫలమూలాశినాం వీర పాదమూలేషు వర్తితుమ్, ఏష మే పరమో కామః"** (కందమూలాలను భుజించి సత్వగుణాన్ని కల మునుల పాదసమీపంలో ఒదిగి ఉండాలని, గంగా తీరంలో ఉండే తపోవనాలను చూడాలని నేను ఆశపడుతున్నాను. ఇదే నా కోరిక)

సీత పలికిన ఈ మాటలను విన్న రాముడు తన అభిప్రాయాన్ని నెరవేర్చుకోవడానికి తగిన సమయం ఇదే అని భావించాడు. లక్ష్మణుని పిలిచి సీతను అడవిలో తీసికొని వదలిపెట్టి రమ్మన్నాడు. లక్ష్మణుడు కూడా రాముని ఆజ్ఞ మీర లేక తనకు ఇష్టం లేకపోయినా, ఆమెను వనంలో విడిచిపెట్టాడు. రాముని అభిప్రాయాన్ని సీతకు తెలిపి అయోధ్యకు తిరిగి వచ్చాడు. సీతాదేవి రామచంద్రుని అభిప్రాయాన్ని విన్నప్పుడు

చాలా బాధపడి తన ప్రాణాలను విడిచి పెట్టి ఉండాలి. అయినా, ఆ విధంగా చేయకుండా రాముని మనస్సును అనుసరించి అతని ఇష్ట ప్రకారంనిలచి ఉండవలసిన పారతంత్ర్యాన్ని కలిగినది కనుక ప్రాణాలతో నిలచింది. "**మాయుమ్ వకై అఱియేన్ వల్ వినైయేన్ పణ్ పిఱన్దే**" (మరణించే దారి తెలియకుండా ఉన్నాను. ఆడజన్మను ఎత్తాను) అని అన్నారు నమ్మాళ్వార్లు కూడా.

లంకలో సీత చెరలో ఉన్నప్పుడు శ్రీరాముని కోసమే తాను ప్రాణాలను ధరించి నిలిచినట్లు హనుమంతుని వద్ద చెప్పింది. "**న చాస్య మాతా న పితా చ నాన్యః స్నేహాద్విశిష్టోస్తి మయా సమో వా**" అనే శ్లోకంలో–ఒకనికి తల్లి అని, తండ్రి అని, పుత్రులు అని పలు విధాలుగా పలువురి పట్ల ఉండే ప్రేమను రాముడు నా ఒక్కతెపట్ల కలిగి ఉన్నాడు. అతడు సముద్రానికి ఆనకట్ట కట్టి లంకకు వచ్చి, రావణుని చంపి, నన్ను తిరిగి అయోధ్యకు తీసికొని పోవాలని భావించినపుడు నేను అక్కడ ప్రాణాలతో లేకపోతే అతని మనసు ఎంతో బాధపడుతుంది. అందువల్ల ఆ రాముని కోసమే నేను నా ప్రాణాలను విడవకుండా ఎంత బాధ అయినా సహిస్తూ నిలచి ఉన్నాను"-అని హనుమంతుని దగ్గర సీత పలికింది.

“కానీ, ఇప్పుడు ఆ రాముడే నన్ను వద్దని విడిచి పెట్టినప్పుడు నేను ప్రాణాలను విడిచి ఉండవచ్చు. అయితే . రఘుకులంలోని సంతతి ఇపుడు నా కడుపులో ఉన్నందున దానికి హాని ఏర్పడకూడదు అనే భావనతోనే నేను నా ప్రాణాలను ధరించవలసిన వచ్చింది". **“న ఖల్వద్యైవ సౌమిత్రే! జీవితం జాహ్నవీజలే, త్యజేయం రాఘవం వంశే భర్తుర్మా పరిహాస్యతి**"– శ్రీరాముని వంశం నశించకూడదు అని నేను ప్రాణాలను విడువకుండా ఉన్నాను. లేకపోతే ఇప్పుడే

గంగాజలంలో ప్రాణాలను విడిచి ఉండేదాన్ని. (రాముని విషయంలో సీతాదేవి ప్రీతిని కలిగి ఉన్నందున, అతని సంతతికి హాని రాకూడదు అని ప్రాణాలను ధరించింది)

"**ఆఱ్ఱాగామైయిన్ కనత్తాలే ముడిందు పిళైక్కై తేట్టమా నిఱ్కచ్చెయ్ దేయుమ్ అదు శెయ్యమాట్టాదే, పెరుమాళ నినైవై పిన్ శెన్రు తన్ ప్రాణనై నోక్కికొండిరుక్కవేండుమ్ పడియాన పారతంత్ర్యత్తైయితే ప్రకాశిప్పిఱ్ఱాదు**" (ఆర్తిలోని అతిశయం చేత మరణించడం తప్పక చేయవలసిన పని అయినా, ఆ విధంగా మరణించకుండా, శ్రీరాముని అభిప్రాయాన్ని అనుసరించి ప్రాణం నిలుపుకునే రీతిలోని తన పారతంత్ర్యాన్ని సీత ప్రకాశింపజేసింది)

కుశలవులు జన్మించడం శ్రీరామునకు ఇష్టం. అతడు తన అభిప్రాయాన్ని "**అపత్యలాభో వైదేహి**" అనే శ్లోకంలో తెలియజేశాడు. అందువల్ల సీతాదేవి ఆ అభిప్రాయాన్ని అనుసరించి తన ప్రాణాలను విడువలేదు. అయితే కుశలవులు జన్మించిన తరువాత సీత తన ప్రాణాలను విడిచి ఉండాలి కదా? ఆ పని ఎందుకు చేయలేదు?

"**పతిర్హి దైవతం నార్యాః పతిర్గతిః, ప్రాణైరపి ప్రియం తస్మాత్ భర్తుః కార్యం విశేషతః, పాలయంతీ హరేర్భావం పత్నీ భగవతో హ్యహమ్**" అని సీతా దేవి చెప్పింది.

పడుకలో ఉన్నా, అడవిలో ఉన్నా పత్నిగా ఉండేది స్వభావానికి తగినట్లు తన పారతంత్ర్యాన్నే సీతాదేవి ప్రకాశింప జేసింది. భర్త అభిప్రాయాన్ని అనుసరించి ప్రవర్తించడం పతివ్రతా లక్షణం కదా.

భర్త విడిచి వేసినప్పటికీ సీత బాధపడకుండా ఉండడం తగినదా? ఆమె దుఃఖం పొందలేదా? సాధారణ స్త్రీ అయి ఉంటే ఈ దశలో భర్తను ఎంత తీవ్రంగా నిందించి ఉంటుంది? సీతకు తాపం కలుగక లేకపోలేదు. ఆమెకు చాలా దుఃఖం కలిగింది. అయినా, భర్త అయిన రాముని మనస్సును అనుసరించి నడవడమే పారతంత్ర్యస్వరూపం అని భావించి ఉన్నది. ఈ స్థితిలో సీత ప్రాణాలను ధరించి ఉండడమే ఆమె మరణించడానికి సమానం. తన భర్త ప్రీతిని అనుసరించి ప్రవర్తించాలి అని ఆమె భావించింది. ఈ విధంగా పత్నీత్వ ప్రయుక్తమైన పారతంత్ర్యాన్ని సీతాదేవి రెండవ వియోగంలో చక్కగా వ్యక్తం చేసింది. భగవంతుని అభిప్రాయాన్ని అనుసరించి నడవడమే పారతంత్ర్యాన్ని కలిగిన జీవుని స్వరూపం.

## మూడవ విశ్లేషం:

లక్ష్మీదేవి భగవానునకు మాత్రమే చెందినది అనే అనన్యార్హత్వం మూడవ వియోగంలో ప్రకాశింప జేసింది. "**అనన్యా రాఘవేణాహమ్**" అని అంటూ సీతాదేవి తాను శ్రీరామునకు మాత్రమే చెందినదాన్ని అని పలికింది. రాముడు కూడా "**అనన్యా హి మయా సీతా**" తనకే చెందినది అని అన్నాడు.. దీనిని సీతాదేవి తన మూడవ వియోగంలో వ్యక్తం చేసింది.

శ్రీ రాముడు అశ్వమేధయాగం చేస్తున్నాడు. కుశలవులు శ్రీరాముని పుత్రులు. వాల్మీకి ఆజ్ఞప్రకారం అయోధ్యా నగరంలోని వీధులలో రామాయణాన్ని అందంగా పాడుతున్నారు. ఈ గానాన్ని విన్న రాముడు మరునాడు వారిని తన ఆస్థాన మండపానికి వచ్చి రామాయణాన్ని పాడమని పిలిచాడు. శ్రీరాముడు సీత చరిత్ర అని ఆనందించి రామాయణాన్ని వినాలని ఆశపడ్డాడు. ఆ విధంగానే

కుశలవులు రాజ సభకు వచ్చి రామాయణాన్ని అందంగా గానం చేస్తున్నారు.

దానిని విన్నప్పుడు రాముని మనసు సీత చుట్టూ తిరుగుతున్నది. సీత ఆ సభకు వచ్చి తన పరిశుద్ధతను మళ్ళీ నిరూపించుకుంటే ఆమెను మళ్ళీ తాను స్వీకరిస్తాను-అని వాల్మీకికి రాముడు వర్తమానం పంపాడు. వాల్మీకి కూడా ఆ విధంగానే సీతను రాముని సభకు తీసుకుని వచ్చి పలు విధాలుగా సీత పవిత్రతను వివరించాడు. అప్పుడు రాముడు "సీత పవిత్రురాలు అనే విషయం నాకు తెలుసు. అంతేకాదు, ఆమెలో ఏ దోషం లేదని ఈ మహర్షి చెప్పినది చాలు. అయినా, ఈ సభలోని లోకులు అందరూ తెలిసేటట్లు ప్రమాణం చేసి సీత తన పవిత్రతను నిరూపించుకోవాలి" అని అన్నాడు. శ్రీరాముని ఈ వాక్యాన్ని వినగానే సీత చాలా బాధపడింది. కన్నీరు మున్నీరుగా విలపించింది. తలవంచుకుని తన తల్లి అయిన భూదేవిని ఉద్దేశించి ఈ విధంగా శపథం చేసింది.

"యథాహం రాఘవాదన్యం మనసాపి న చింతయే,
తథా మే మాధవీదేవి వివరం దాతు మర్హతి,
మనసా కర్మణా వాచా యథా రామం న చింతయే,
తథా మే మాధవీదేవి వివరం దాతుమర్హతి,
యథైతత్ సత్యముక్తం మే వేద్మి రామాత్ పరం న చ,
తథా మే మాధవీదేవి వివరం దాతుమర్హతి"

స్త్రీలకు కష్టం వచ్చినప్పుడు తమ తల్లిని భావించి 'అమ్మా!' అని పిలిచి దుఃఖపడతారు. ఆ విధంగానే సీతాదేవి కూడా తనకు భరించలేని అవమానం ఏర్పడిన సమయంలో తాను భూమి నుండి పుట్టినది కనుక భూదేవిని సంబోధిస్తూ భయంకరమైన ప్రతిజ్ఞ చేసింది.

"తల్లీ! భూదేవీ! నీవే కదా ఈ ఆపద సమయంలో నన్ను కాపాడాలి. నేను మనసులో కూడా రాముని తప్ప ఇంక ఎవరిని భావించకపోవడం నిజమైతే, తల్లీ! నువ్వే వచ్చి దానిని ఈ సభలో నిరూపించాలి. నా భర్త రాముడు తప్ప ఇంకొక గొప్ప దైవం నాకు లేరు-అని నేను భావించిన విషయం నిజమైతే, తల్లీ! నీవే వచ్చి ఈ సభలో ఆ విషయాన్ని నిరూపించాలి–అని ఈ విధంగా చాలా రీతులలో ప్రార్థన చేసింది .

అప్పుడు అక్కడ భూమి బ్రద్దలైనది. దాని నుండి భూదేవి ఒక దివ్య సింహాసనం చేతిలో పట్టుకొని ప్రత్యక్షమైంది. రెండు చేతులతో స్వాగతం పలుకుతూ సీతాదేవిని ఎత్తుకొని ఆ దివ్య సింహాసనంలో కూర్చొబెట్టుకుని భూమి లోపలకి ఆ సీత తో పాటు వెళ్ళిపోయి అంతర్ధానమైంది. దేవతలు అప్పుడు దుందుభులను మోగించారు. పూల వర్షాన్ని కురిపించారు.

ఈ వియోగం చేత లక్ష్మీ స్వరూపిణి అయిన సీతాదేవి తాను భగవానునకు మాత్రమే చెందినది, ఇంకొకరికి చెందినది కాదు–అనే తన అనన్యార్హత్వాన్ని వ్యక్తం చేసింది..

ఈవిధంగా శ్రీ రామాయణంలో మూడు వియోగాల ద్వారా పురుషకార స్వరూపిణి అయిన లక్ష్మి, సీతగా అవతరించి తనకు పురుషకారం చేసేటప్పుడు కావలసిన మూడు గుణాలు( కృప, పారతంత్ర్యం, అనన్యార్హత్వం అనేవి) పూర్ణంగా ఉన్నాయని చక్కగా వ్యక్తం చేసింది-అనే విషయాన్ని మనం తెలియవచ్చు.

లక్ష్మీదేవికి మాత్రమే చెందిన ధర్మం పురుషకారం-అనే విషయం, పురుష కారానికి కావలసిన ముఖ్యమైన కృప, పారతంత్ర్యం అనన్యార్హత్వం-అనే గుణాలను పూర్తిగా కలిగినది అనే విషయం ఈ గ్రంథంలోని మొదటి భాగంలో స్పష్టంగా చూశాము.

ఇక తనకు కల ఆ ధర్మాన్ని శ్రీరామాయణంలో అనేక సందర్భాలలో సీతాదేవి ఆచరించి చూపించింది-అనే విషయాన్ని తరువాతి భాగంలో చూడగలం.

ꕥꕥꕥꕥꕥꕥꕥꕥꕥꕥꕥꕥꕥ

# రెండవ భాగం

## లక్ష్మణుని విషయం:

శ్రీరాముడు లక్ష్మణుని తనతో అరణ్యానికి తీసుకొని పోవడానికి మొదట ఇష్టపడలేదు. అప్పుడు లక్ష్మణుడు సీతాదేవిని పురుష కారణంగా చేసికొని, శ్రీరాముని పాదాలను ఆశ్రయించి తన కోరికను నెరవేర్చుకున్నాడు.

"స భ్రాతుః చరణౌ గాఢం నిపీడ్య రఘునంధనః,
సీతాముువాచాతియశాః రాఘవం చ మహావ్రతమ్"

(గొప్ప కీర్తిని కల లక్ష్మణుడు తన అన్న అయిన శ్రీరాముని చరణాలను గట్టిగా పట్టుకొని, సీతాదేవిని పురుషకారంగా చేసికొని, సత్యవ్రతుడు(ఉపాయం) అయిన ఆ శ్రీరాముని చూచి ఈ విధంగా అన్నాడు) అనే శ్లోకం ద్వారా లక్ష్మణుడు సీతాదేవిని పురుషకారంగా చేసుకుని శ్రీరాముని చరణాలు ఆశ్రయించాడు, ఆ విధంగా ఆశ్రయించినందున నిరంతరం శ్రీరామునకు సేవ చేయడం అనే తన అభీష్టాన్ని పొంది ఆనందించాడని తెలిసి కొంటున్నాము.

ఇంతేకాక, ఇదే విధంగా పంచవటిలో జరిగిన ఒక సందర్భాన్ని చూడవచ్చు. "నీటి సౌకర్యం ఉండేచోట, నీకు ఇష్టపడిన చోట నీవు పర్ణశాలను కట్టు" అని రాముడు లక్ష్మణునితో అన్నాడు.

“ఏవముక్తస్తు రామేణ లక్ష్మణఃసంయతాంజలిః,
సీతాసమక్షం కాకుత్ స్థం ఇదం వచనమబ్రవీత్"

(రాముని చేత ఈ విధంగా ఆజ్ఞాపించిన పంపబడిన లక్ష్మణుడు చేతులను జోడించి శ్రీత సమక్షంలో ఆమెను పురుష కారణంగా చేసికొని రాముని ఉద్దేశించి ఈ మాటను అన్నాడు)

"పరవానస్మి కాకుత్ స్థ త్వయి వర్షశతం స్థితే,
స్వయం తు రుచిరే దేశే క్రియతామితి మాం వద"

(శ్రీరామా! నీవు నూరువత్సరాల వరకు ఉన్నా నీకు నేను పరతంత్రుడను. నీకు ఇష్టమైన చోట కట్టు అని నన్ను అజ్ఞాపించు)

"నీకు ఇష్టమైన చోట పర్ణశాల కట్టు" అని రాముడు అనడం లక్ష్మణునకు బాధ కలగడానికి కారణమైనది. దాసునకు ఎప్పటికైనా స్వయంగా ఇష్టం అనేది ఉండదు కదా. భగవంతుని ఇష్టమే దాసులకు ఇష్టం. ఆ విధంగా ఉండగా, "నీకు ఇష్టమైన చోట కట్టు" అని రాముడు చెప్పిన వెంటనే ‘పారతంత్ర్యమే స్వరూపంగా కలిగిన నా తలపై స్వాతంత్ర్యాన్ని రాముడు పెడుతున్నాడే! ఒకవేళ ఈ విధంగా నన్ను దూరం చేసుకోవాలి అని చూస్తున్నాడా!’-అనే భయం, బాధ లక్ష్మణునకు కలిగింది. వెంటనే సీతను పురుష కారంగా చేసికొని రాముని లక్ష్మణుడు ప్రార్థించాడు.

ఒక పతివ్రత స్త్రీ భర్తను చూచి "ఈనాడు ఏమి వంట చేయమంటారు?" అని అడిగితే, దానికి అతడు "నీకు ఇష్టమైనది చెయ్యి" అని బదులు చెప్పినపుడు, దానిని విని ఆమె మనసులో భయపడాలి. ఎందుకంటే, పతివ్రతకు తనకంటూ ఒక ప్రత్యేకమైన ఇష్టం ఉంటుందా? భర్త ఇష్టమే కదా ఆమె ఇష్టం.

## గుహుని విషయం:

వేటగాళ్ల జాతికి చెందిన గుహుడు కూడా మొదట సీతా దేవి కటాక్షం పొందినవాడే. శ్రీరాముడు గుహుని చూచి "**ఏళాఌ ఏదలన్ కీఌ మకన్ ఎన్నాదు ఇరంగి మఱ్ఱవర్ కుృ ఇన్నరుళ్ శురందు మాళై మాన్ మడనోక్కి ఉన్ తోళి ఉంబి ఎంబి ఎన్ను ఒళిందిలై ఉకందు తోళన్ ఎనకుృ**" (గుహుడు జ్ఞానం లేనివాడు. అల్పానందాలలో ఆశ కలవాడు. వధించడమే వృత్తిగా కలవాడు. అధమ జాతికి చెందినవాడు–అని ఈ విధంగా భావించకుండా దయ చూపించి, "అందమైన కన్నులను కల ఈ సీతాదేవి నీకు స్నేహితురాలు, నా తమ్ముడు లక్ష్మణుడు నీకు తమ్ముడు" అని పలికి గుహునిపై దయ చూపించాడు) అనే విధంగా చాలా ప్రీతిని చూపించాడు.

## సుగ్రీవుని విషయం:

రావణుడు సీతను తీసుకుని పోయేటప్పుడు ఋష్యమూక పర్వతంపై సుగ్రీవుడు ఉండేచోట సీత తన ఆభరణాలను కొన్నిటిని ఉత్తరీయంలో మూటగట్టి కిందకు జారవిడిచింది. సుగ్రీవుని, అతని అనుచరులను చల్లగా చూసింది. ఇందువల్లనే శ్రీరాముడు సుగ్రీవుడు ఉండే చోటు వెదకి వెళ్లి, అతని కోరికలను తీర్చి అతనిని సంతోష పెట్టాడు. లక్ష్మీ కటాక్షం పొందిన వారిని భగవంతుడు స్వయంగా వెదకి వారి దగ్గరకు వెడతాడు-అనే

విషయానికి ఇది ఒక ఉదాహరణ. ఈ విధంగా అనుకూలంగా ఉండే వారి విషయంలోనే కాక, ప్రతికూలంగా ఉండేవారి విషయంలో కూడా సీతాదేవి పురుషకారం చేసిన విధానాన్ని ఇక గమనిద్దాం.

## కాకాసురుని విషయం:

సీతాదేవి విషయంలో నేరుగా తీరని అపరాధాన్ని చేసినవాడు కాకాసురుడు. అతని పట్ల తన కృపకారణంగానే సీతాదేవి పురుషకారం చేసింది. అతని ప్రాణాలను శ్రీరాముని బ్రహ్మాస్త్రం నుండి కాపాడింది.

ఒకానొక సమయంలో సీత, రాముడు చిత్రకూట పర్వతంపై ఏకాంతంలో ఉండేటప్పుడు, శ్రీ రాములు సీత ఒడిలో తల పెట్టుకొని నిద్రపోయాడు. అప్పుడు మాంస కోసం కాకాసురుడు అక్కడకు వచ్చి సీత వక్షస్సును తన గోళ్ళతో గీరి, గాయపరిచాడు. ఆ గాయాన్ని సీత మన్ను అద్దుకొని భరించింది. అప్పుడు తన ఒడిలో నిద్రపోయే శ్రీరాముని నిద్రకు ఆటంకం రాకూడదు-అని సీతాదేవి ఆ గాయం వల్ల కలిగిన బాధను సహించి ఊరికే ఉండిపోయింది. కొంత సేపు అయిన తరువాత కాకాసురుడు మళ్లీ అక్కడకు వచ్చి ఆమెను గాయపరిచాడు. ఆమె ఎంత ప్రయత్నం చేసినా కాకాసురుడు తొలగిపోలేదు. రాముడు నిద్ర లేచి విషయాన్ని గమనించి "కాకిని కూడా తరిమికొట్టే లేవా?" అని పరిహాసంగా నవ్వాడు. సీత సిగ్గుపడింది. ఈ సందర్భం మనకి ఏమి తెలియజేస్తున్నది? అంటే, చిన్న రక్షణను కూడా జీవుడు భగవంతుని కరుణ లేకపోతే చేసుకోలేడు-అని. అప్పుడు కొంత సేపు సీత రాముని ఒడిలో నిద్రించింది. ఆ తర్వాత మళ్లీ రాముడు సీత ఒడిలో నిద్రపోయాడు. కాకాసురుడు మళ్ళీ వచ్చి సీతను బలంగా గాయపరిచాడు.

"వాయసేన తత స్తేన బలవత్ క్లశ్యమానయా,
స మయా బోధితః శ్రీమాన్ సుఖసుప్తః పరంతపః"

(నిద్రించే సమయంలో కూడా శత్రువులకు తాపాన్ని కలిగించగలిగిన ప్రతాపాన్ని కల రాముని నిద్రాసౌందర్యంలో ఆసక్తిని కల నన్ను కాకాసురుడు గాయపరచాడు. అపుడు రాముడు నిద్రలేచాడు)

మనవంటివారు నిద్రించేటప్పుడు మన శరీరంలో ఎన్నో అవలక్షణాలు వ్యక్తం అవుతాయి. అయితే, పురుషోత్తముడు ఏ సమయంలో అయినా అందంగానే ఉంటాడు. భగవంతుని మిగిలిన దశలలో కంటే **"ఏరార్ కోలమ్ తికళ క్కిడందాయ్"** **(**అందం నిండుగా ప్రకాశించే టట్లు పరుండి ఉన్నావు), **"కిడందదోర్ కిడక్కై"** (అద్వితీయంగా శయనించి ఉండే రీతి) అని చెప్పే రీతిలో, చాలా ఆశ్చర్యాన్ని కలిగించే రీతిలో, నిద్రాసమయంలోని అందం అసాధారణమైనది. ఆ స్వామి అందం అంతా ఆ సమయంలో దర్శించి మంగళాశాసనం చేసేటట్లు ఉంటుంది. అళ్వార్లు, మన పూర్వాచార్యులు ఆలయాలలో భగవానుని అందాన్ని దర్శించి చాలా ప్రీతిని పొందారు. శ్రీరంగంలో పరుండి ఉండే శ్రీరంగనాథుని అందాన్ని దర్శించిన తిరుప్పాణ్ ఆళ్వార్లు **"ఎన్ అముదినై క్కండ కణ్ గళ్ మఱ్ఱొన్ఱినై క్కాణావే"** (అమృతం వంటి శ్రీ రంగనాథుని అలరించిన నా కన్నులు ఇక వేరు దేనిని చూడవు) అని అన్నారు. తొండరడిప్పొడి ఆళ్వార్లు 'తిరుమాలై' ప్రబంధంలో శ్రీరంగనాథుని అందాన్ని **"కుడదిశై ముడియై వైత్తు కుణదిశై పాదమ్ నీట్టి వడదిశై పిన్బు కాట్టి తెన్ దిశై ఇలంగై నోక్కి, కడల్ నిఱక్కడవుళ్ ఎందై అరవణై త్తుయిలుమా కండు ఉడలెనక్కు ఉరుగుమాలో! ఎన్ శెయ కేన్ ఉలకత్తీరే!"** (పడమటి దిక్కున తలను పెట్టుకుని, తూర్పు దిక్కులో పాదాలను

చాచి, ఉత్తర దిశ వైపు వెనుక భాగాన్ని చూపిస్తూ, దక్షిణ దిక్కు చూస్తూ ఆదిశేషునిపై ఉండే స్వామి రీతిని చూచి నా శరీరం ద్రవిస్తున్నది, జనులారా! నేనేమీ చేయను" అని అన్నారు .

సహజంగానే చాలా అందమైన వాడు రాముడు. తన ఒడిలో రాముడు నిద్రించేటప్పుడు ఆ అందం ఇంకా చాలా ఎక్కువగా సీతాదేవికి గోచరించింది.

బాధను భరించలేని సీత, రాముని నిద్రలేపింది. రాముడు కన్నులను తెరచి చూసి సీత గుండెలపై ఏర్పడిన గాయాన్ని, కాకాసురుని ముక్కులో రక్తాన్ని చూచాడు. అతనికి పట్టరాని కోపం కలిగింది. కాకాసురుడు భయపడి దాగాలని చూచాడు. రాముడు చాలా ఆగ్రహంతో ఒక దర్భను తీసుకొని మంత్రించి బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించి, కాకాసురునిపై వదిలాడు. ఆ అస్త్రం నిప్పులు వెదజల్లుతూ కాకాసురుని వెంబడించి తరిమింది. ఆకాశంలో అంతటా తిరిగి తప్పించుకోవాలని అతడు ప్రయత్నం చేశాడు, కానీ అతని ప్రయత్నం ఫలించలేదు.

ముల్లోకాలలోను తిరిగినా, దేవతలు, ఋషులతో పాటు ఎవ్వరూ అతనికి రక్షణ ఇవ్వలేదు. తల్లిదండ్రులతో పాటు అందరూ అతనిని వదిలిపెట్టారు. రామభయంతో అందరూ అతనిని దూరంగా తరిమికొట్టారు. చివరకు కాకాసురుడు బయలుదేరిన చోటుకే వచ్చి ఏ గతి లేనివాడై రాముని ముందు పడ్డాడు.

"స పిత్రా చ పరిత్యక్తః సురైశ్చ సమహర్షిభిః ,
త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య తమేవ శరణం గతః,
స తం నిపతితం భూమౌ శరణ్యః శరణాగతమ్,
వధార్హమపికాకుత్ స్థః కృపయా పర్యపాలయత్"

అనే విధంగా భూమిపై పడి ఏ గతి లేనివాడై ఉండే ఆ కాకాసురుడు వధించ దగినవాడైనా, అతనిని రాముడం కృపతో, అంటే, సీత చేసిన పురుషకారం కారణంగా కాపాడాడు

సీత కారణంగా రామునకు దయ కలిగింది అని అనడం ఏవిధంగా? అంటే,

పురతః పతితం దేవీ శరణ్యా వాయసం తథా ,
తచ్ఛిరః పాదయోః తస్య యోజయామాస జానకీ,
తముత్థాప్య కరేణాథ కృపాపీయూషసాగరః
రరక్ష రామో గుణవాన్ వాయసఇా దయయైక్షత"

(శరణు పొందగలిగిన సీతాదేవి తన ముందు పడిన కాకాసురుని తలను రాముని పాదాల దగ్గరకు చేర్చింది. అప్పుడు కరుణ అనే అమృతానికి సముద్రం వంటివాడైన రాముడు కాకాసురుని పైకి లేపి, అతనిని రక్షించాడు. దయతో చూచాడు) అని చెప్పినట్లుగా జానకి దేవి అప్పుడు తన ముందు పడిన కాకాసురుని చూసి,

"ప్రాణసంశయమాపన్నం దృష్ట్వా సీతాథ వాయసమ్,
త్రాహి త్రాహీతి భర్తార మువాచ దయయా విభుమ్"

(ప్రాణాలకే ముప్పు వచ్చిన ఆ కాకాసురుని సీత చూచి దయతో "రక్షించు రక్షించు" అని భర్తతో అన్నది)

ప్రాణం ఉందో లేదో అని సందేహపడే ఆపద కలిగిన సమయంలో కాకాసురుని చూచిన సీత దయతో, తనకు నోటితో తెరిచి చెప్పడానికి సాధ్యం కాని అపరాధాన్ని చేసిన వాడైనా, అతని దుఃఖాన్ని చూచి దయ పొంది, శ్రీరాముని పాదాలలో ఆ కాకాసురుని తలను నేరుగా ఉండేటట్లు చేర్చింది. తరువాత కరుణాసముద్రుడైన రాముడు ఆ కాకాసురుని తన చేతితో పైకి ఎత్తి రక్షించాడు. కాకాసురుని కరుణతో చూచాడు.

**"ఇవళ్ సన్నిధియాలే కాకం తలెప్పెర్రదు. అదిల్లామైయాలే రావణన్ మాండాన్"** (సీతాదేవి సాన్నిధ్యం వల్ల కాకాసురుడు బతికాడు. అది లేనందున రావణుడు నశించాడు) అని పిళ్లై లోకాచార్యులవారి సూక్తి.

## సీతా సన్నిధి:

ఇక్కడ మనం కొంచెం గమనించి చూడాలి. రావణుని దోషం అధికమా? కాకాసురుని దోషం అధికమా? అనే విషయాన్ని మనం గమనిద్దాం. రావణుడు సీతను అపహరించుకుని పోయాడే తప్ప ఆమె ఇష్టానికి వ్యతిరేకంగా ఆమెను తాకి బాధించలేదు. కాకాసురుడు అయితే ఆమె శరీరాన్ని తన ముక్కుతో గుచ్చి బాధించాడు. రావణుడు మొదటి యుద్ధంలో అన్ని ఆయుధాలను పోగొట్టుకొని నిరాయుధుడై నిలచాడు. కాకాసురుడు కూడా ఆ విధంగానే ఆశ్రయం లేకుండా నిస్సహాయుడై నిలచాడు. రామబాణం తరిమికొట్టగా ముల్లోకాలు తిరిగి రాముని ముందే వచ్చి పడ్డాడు. ఈ విధంగా ఇద్దరిని స్థితి సమానం అయినా, రావణుడు తక్కువ దోషాన్ని కలవాడైనా, చివరకు నశించిపోయాడు. కాకాసురుడు రక్షింపబడ్డాడు. దీనికి ఏమి కారణం? అంటే, సీతాదేవి సన్నిధి ఉండడంవల్ల కాకాసురుడు రక్షింపబడ్డాడు, అది లేనందున రావణుడు నశించాడు. దోషం నిండుగా ఉన్నా కాకాసురుడు సీతాదేవిని ఆశ్రయంగా పొందినందున ఆ తల్లి కరుణకు అతడు విషయమై జీవించ గలిగాడు.

## బ్రహ్మాస్త్రం తరిమింది:

కొంతమందికి ఇక్కడ అ ఒక సందేహం కలగవచ్చు. అది ఏమంటే, బ్రహ్మాస్త్రం మూడు లోకాలు చుట్టినా కాకాసురుని

చంపకుండా కేవలం వెంట తరిమిందే! అది ఏ విధంగా జరిగింది? అనేది ఆ సందేహం.

దీనికి మన పూర్వాచార్యులు చాలా అందంగా బదులు చెప్పారు. "**మిత్ర భావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన**" అని శ్రీరాముని వార్త. "ఎవడైనా ఒకడు నిజమైన స్నేహంతో రాకపోయినా, నా స్నేహితుని వలె నటిస్తూ వచ్చినా చాలు. అతని నేను విడువను. రక్షిస్తాను. అతనికి దోషం అడ్డు కాదు" అని అన్నాడు రాముడు.

రాముని స్వభావం అది. "**యచ్ఛీలో స్వామీ తచ్ఛీలో దాసః**" (స్వామి ఎటువంటి ప్రభావాన్ని కలిగి ఉంటాడో, దాసులు కూడా అటువంటి స్వభావాన్ని కలిగి ఉంటారు) అనేది ఒక సామెత. భగవంతుని ఆయుధాలు కూడా ఆ విధంగానే ఉంటాయి. రాముని బ్రహ్మాస్త్రం కాకాసురుని తరిమినప్పుడు, ముందుగా పరిగెత్తుకొని పోయే కాకాసురుడు తన వెంట వచ్చే బ్రహ్మాస్త్రం ఎంత దూరంలో వస్తున్నది?, అని తిరిగి చూచేవాడు. ఆ విధంగా చూసేటప్పుడు ఆ అస్త్రం ఒకవేళ రాముడు ఉండే దిక్కు వైపు కాకాసురుడు ఏదైనా ఒక అంజలిని కానీ, శరణాగతిని కానీ చేసి బతికి బయటపడినా పడనీ! అని అతనిని చంపకుండా విడిచింది. ఆ విధంగా ఆ అస్త్రం కాకాసురుని రాముడు ఉండే చోటు వరకు తరిమి తీసికొనివచ్చింది-అని అని మన పూర్వాచార్యులు అందంగా బదులు పలికారు.

## రాక్షస స్త్రీలకు అభయం:

ఆ విధంగానే శ్రీరామాయణంలో సీతాదేవి తన పట్ల కఠినంగా ప్రవర్తించి బాధించిన రాక్షస స్త్రీలను వారు అడగకుండానే వారిపై దయతో కాపాడిన సంగతిని కూడా గమనించవచ్చు.

సీత లంకలోని అశోకవనంలో బంధింపబడి ఉండేటప్పుడు 'ఏకాక్షి', 'ఏక కర్ణిక' మొదలైన రాక్షస స్త్రీలు రావణుని ఆజ్ఞానుసారం సీతాదేవిని నానా విధాలుగా బాధించారు. రావణుడు యుద్ధంలో మరణించిన తరువాత, శ్రీరాముని విజయవార్తను హనుమంతుడు సీతాదేవికి తెలియజేశాడు. ఆనందం ఎక్కువగా కలిగినందున ఆమె ఏమీ మాట్లాడలేక ఒక క్షణకాలం మౌనంగా ఉండిపోయింది.

అప్పుడు హనుమంతుడు ఆమెతో "అమ్మా! ఈ సంతోష వార్తను నీకు తెలియజేసిన నాతో ఏ మాట పలుకకుండా మౌనంగా ఎందుకు ఉన్నావు? "అని అడిగాడు. సీతాదేవి "నీవు చేసిన ఉపకారానికి ఏమి బదులు తీర్చుకోగలను? తగిన బదులు ఏది? అని ఆలోచిస్తున్నాను. నాకైతే ఏమీ తోచడం లేదు" అని అన్నది. ఆ మాట వినగానే హనుమంతుడు ఇదే తగిన సమయం అని భావించి, " తల్లీ! నీవు నాకు ఏదైనా ఒక ఉపకారాన్ని చేయాలని అనుకుంటే ఇదిగో ఇక్కడ ఉండే ఈ క్రూర రాక్షస స్త్రీలను తగిన విధంగా నేను శిక్షించే అవకాశం నాకు ఇవ్వాలి. నిన్ను వారు ఎంత బాధ పెట్టారో నేను ఇక్కడకు వచ్చినప్పుడు సాక్షాత్తుగా చూశాను. దానికి బదులుగా నేను వీరిని నా చేతులతో కొట్టి, పళ్ళతో కరిచి, గోళ్ళతో గీరి, కాళ్లతో తన్ని, పిడికిళ్ళతో పొడిచి వధిస్తాను. దానికి నీవు అనుమతించాలి. ఇదే నాకు నీవు ఈ సమయంలో చేయవలసిన, ఇవ్వవలసిన తగిన బహుమానం. వీరు చాలా క్రూరులు. వీరిని చంపడంలో ఏ తప్పు లేదు" అని అన్నాడు.

హనుమంతుడు పలికిన ఈ మాటను సీతాదేవి విని "వానరా! నీవు వీరు ఇప్పుడు ఉండే స్థితిని గమనించలేదు. వీరు నిన్ను చూచి  చాలా భయపడుతున్నారు. నీవు వీరిని పంపడం సరికాదు. నిజానికి వీరిలో ఏ దోషం లేదు. యజమాని చెప్పినది విని దానిని చేయడం తప్పు కాదు. తమ యజమాని అయిన

రావణుడు చెప్పిన ప్రకారం వారు చేశారు. నా కర్మ ఫలాన్ని నేను అనుభవించాను" అని సీతాదేవి అన్నది.

ఆ మాట విని హనుమంతుడు రాక్షస స్త్రీలను ఏ విధంగా అయినా బాధ పెట్టాలి అని భావించి, " తల్లీ! నీవు తలచినట్లు వీరు దోషం లేని వారు కారు. చాలా క్రూరమైన పని చేసినవారు. రావణుడు ఒకటి చెబితే వీరు దానిని పదింతలుగా చేసి నిన్ను బాధించారు. వీరిని చంపాలని నా కోరిక" అన్నాడు. అప్పుడు సీతాదేవి:

"అయం వ్యాఘ్రసమీపే తు పురాణో ధర్మసంస్థితః,
ఋక్షేణ గీతా శ్లోకో మే తాన్ నిబోధ ప్లవంగమ"

పురాతనమైన, ధర్మబద్ధమైన ఈ శ్లోకాన్ని ఒక ఎలుగుబంటి ఒక పులితో చెప్పింది. వానరా! దానిని నీకు తెలియజేస్తాను విను. పూర్వం ఒకానొక సమయంలో పులిచేత తరుమ బడిన వేటగాడు పరుగెత్తి ఒక చెట్టుపైకి ఎక్కాడు అప్పటికే ఆ చెట్టుపై ఒక ఎలుగుబంటి ఉన్నది. దానిని చూసి అతడు భయపడి తనను రక్షించమని దానిని శరణువేడారు. ఆది అతనికి అభయం ఇచ్చింది. అతనిని వెంబడించి వచ్చిన పులి చెట్టుపై ఉండే భల్లూకాన్ని చూసి వేటగానిని కిందకు తోసి వేయమని అన్నది. కానీ ఎలుగు బంటి దానికి ఒప్పుకోలేదు. కొంచెం సేపటికి ఎలుగుబంటి నిద్రపోయింది. తగిన సమయం కోసం ఎదురు చూస్తున్న పులి వేటగానితో ఎలుగుబంటిని కిందకు తోసి వేయమని చెప్పింది. వేటగాడు వెంటనే నిద్ర పోయే ఎలుగు బంటిని కిందకు తోసివేశాడు. అయితే ఎలుగుబంటి కింద పడి పోకుండా చెట్టు కొమ్మను పట్టుకుని నిలచింది. పులి దానిని చూసి "నిన్ను కిందకు తోసివేసిన ఇతనిపై పగ తీర్చుకో. ఇప్పటికైనా నీవు అతనిని క్రిందకు తోసివేయి" అని అన్నది. ఎలుగుబంటి అపుడు "నన్ను శరణు పొందిన వాణి నేను వదిలిపెట్టను. అతనికి

హాని చేయను అని అంటూ ఈ క్రింది శ్లోకాన్ని ఎలుగుబంటి పలికింది.

న పరః పాపమాదత్తే పరేషాం పాప కర్మణామ్,
సమయో రక్షితవ్యస్తు సంతః చారిత్రభూషణాః

(మంచివాడు పాపం చేసినవారికి కూడా చెడ్డను తలపెట్టడు. ప్రతి వ్యక్తి తన మాటను రక్షించుకోవాలి. మంచివారు మంచి నడతను ఆభరణంగా కలవారు)

సీతాదేవి ఈ సందర్భాన్ని ఉదాహరించి మళ్ళీ ఈ విధంగా అన్నది:

పాపానాం వా శుభానాం వా వధార్హాణాం ప్లవంగమ,
కార్యం కరుణమార్యేణ న కశ్చిన్నాపరాధ్యతి"

చాలా అందమైనది ఈ శ్లోకం. సీతాదేవి స్వరూపాన్ని చక్కగా నిరూపిస్తుంది. దీని భావం ఏమంటే, "వానరా! నీవు చెప్పే విధంగా ఆ రాక్షసి స్త్రీలు పాపం చేసిన వారే కానీ. లేక, నేను చెప్పినట్లు మంచివారే కానీ. చంపతగినవారే కానీ. ఏమైనా కానీ. వారిని పాలించే రావణుడు చనిపోయాడు. వారు ఇప్పుడు ఉండే గతిని చూడు. ఉత్తములు కరుణను చూపిస్తారు. ఈ లోకంలో తప్పు చేయని వారు ఎవరు? తప్పులను లెక్కించవచ్చునా? ఇసుకతో కలసిన అన్నంలో రాళ్లను ఏరితే ప్రయోజనం ఉంటుందా? నీకు నీ నాధుడు వీరిని చంపమని చెప్పలేదు కదా. మరి నీవు మీ యజమాని చెప్పని పనిని చేస్తానని అంటున్నావే! ఇది నీ తప్పు కాదా? తమ యజమాని చెప్పినట్లు చేసిన వీరిది తప్పా? నీవే చెప్పు. వీరిని వధిస్తానని అనడం నీ మొదటి తప్పు."

సీతాదేవి ఇంకా ఈ విధంగా అన్నది. "నన్ను పది మాసాల కాలం లంకలో ఆ విధంగా విడిచిపెట్టి తన బాధ్యతను

మరచిన శ్రీరాముడు తప్పు చేయలేదా? ఆ స్వామికి శక్తి, సామర్థ్యాలలో లోటు ఉన్నదా? తాను ఉండే చోటులోనుండి ఒక అస్త్రాన్ని ప్రయోగించి, రావణుని చంపి నన్ను కాపాడడం అతనికి సాధ్యం కాదా? ఆ విధంగా ఉన్నా, మరి ఆ విధంగా చేయకపోవడం రాముని దోషమే కదా. స్వామిపై ఇటువంటి దోషాన్ని ఆరోపించే నేను కూడా తప్పు చేసిన దానిని కదా" అని ఈ విధంగా అనేక రీతులలో సీతాదేవి పలికింది. లోకంలో ఎవరు తప్పు చేయలేదు-అనే ప్రశ్నను లేవనెత్తి ఆ రాక్షసులు తనను ఆశ్రయించడానికి ముందే వారి దుర్గతిని చూచి వారిపై జాలిపడి తన కరుణతో వారిని హనుమానుని బారినుండి కాపాడింది.

## రావణుని విషయం:

రావణుడు అశోకవనంలో సీత వద్దకు వచ్చి అనరాని మాటలు ఎన్నో అన్నాడు. తనకు అతనిని బూడిద చేసే శక్తి ఉన్నా, ఆ విధంగా ఆమె శపించలేదు. అతనిని కూడా ప్రాణాలతో విడిచి పెట్టింది. తన పారతంత్ర్య స్వరూపానికి తగినట్లు తనను తానే రక్షించుకోదగిన బాధ్యత తనపై పెట్టుకోలేదు. రాముని మూలంగా ఏర్పడే రక్షణకోసం ఎదురు చూస్తూ ఉన్నది. అయినా రావణుడు సంస్కరింపబడి బాగుపడాలి-అని ఆమె తల్లి మనస్సు కోరింది. తన తేజస్సుకు తగినట్లు **"తృణమంతరతః కృత్వా"** అని ఒక గడ్డిపరకను ముందు అడ్డు చేసుకొని, అతనికి పలు విధాలుగా మంచి ఉపదేశాలను చేసింది.

రావణుడు అహంకారంతో కూడుకొన్న వాడు, రాక్షసుడు అయినందున, అతనితో "నీవు రాముని శరణు వేడు" అని అంటే, ఆ మాటకు ఇష్టపడడు గనక **"మిత్రమ్ ఔపయికం కర్తుమ్"** (రామునితో స్నేహం చేసికోవడం మంచిది) అనే శ్లోకం ద్వారా శ్రీరామునితో స్నేహం చేసుకో, నీవు అప్పుడు బాగుపడతావు-అని

చాలా మెల్లిగా తల్లి తన సంతానానికి మంచి మాటలను చెప్పేటట్లు ఉపదేశించినది. **"మిత్ర భావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన"** అనేది శ్రీరాముడు సముద్రతీరంలో పలికిన మాట, **"మిత్రమౌపయికం కర్తమ్"** అనేది సీతాదేవి పలికిన మాట. ఈ విధంగా జీవుని విషయంలో ఈ దివ్య దంపతులు ఇద్దరి మాట, మనసు ఒకే విధంగా ఉండడం మనం గమనించవచ్చు. అయితే, రావణుని పాపం ఆ మాటను అతనిని అంగీకరించనివ్వలేదు. అందుచేత సీతాదేవి చేసిన ఉపదేశం అతనికి ఫలించలేదు. అయితే, ఆ సమయంలో శింశుపా వృక్షంపై ఉండి ఆ ఉపదేశాన్ని విన్న హనుమంతునకు అది ఫలించింది. **"దూతో హం"** అని మొదట పలికిన హనుమంతుడు ఆ ఉపదేశం విన్న తరువాత **"దాసోహం కోసలేంద్రస్య"** అని తనను నిర్దేశించుకునే రీతిలో దాస్య స్వరూపాన్ని పొందాడు.

## విభీషణుని విషయం:

విభీషణుడు కూడా సీతాదేవి చేసిన పురుషకారం వల్లనే మంచిని పొందాడు. అతడు సీతాదేవిని ఏ విధంగా పురుషకారంగా ఆశ్రయించాడు? అని అంటే- తన భార్య, కుమార్తె ద్వారా సీతాదేవి పురుషకారాన్ని పొందాడు. అశోకవనంలో బంధింపబడి ఉండే సీతాదేవికి వారు ఊరట కలిగించే మాటలను చెప్పి ఆమెకు శాంతి కలిగించారు. ఆ విధంగా ఆమె కరుణను వారు పొందారు. అందుచేత **"విబీడడణఱ్కు నేరాక నల్లానై"** అని శ్రీరాముని అంగీకారాన్ని పొందగలిగాడు.

ఈ విధంగా లక్ష్మణుడు, గుహుడు, కాకాసురుడు, రాక్షస స్త్రీలు, విభీషణుడు అనే వీరంతా సీతాదేవి చేసిన పురుషకారం వల్ల మంచిని పొందారు–అనే విషయాన్ని శ్రీరామాయణంలో మనం చక్కగా తెలియవచ్చు.

# మూడవ భాగం

శ్రీ రామాయణ పురుషులు శ్రీరాముడు, లక్ష్మణుడు, భరతుడు, శత్రుఘ్నుడు అని నలుగురు. వీరు దశరధ చక్రవర్తికి పుత్రులుగా జన్మించి, లోకానికి ఒక్కొక్క ధర్మాన్ని ఒక్కొక్కరు ఆచరించి ఉపదేశించారు.

## సామాన్యధర్మం:

శ్రీరాముడు–'లోకంలో ఒకరు చెప్పినది ఇంకొకరు వినాలి' అనే సామాన్య ధర్మాన్ని, తండ్రి మాటను, తల్లి ఆజ్ఞను, గురువు ఆజ్ఞను, స్నేహితునికి కోరికను, దాసుల ప్రార్ధనను విని, వాటి ప్రకారం నడవడమే మంచిది–అనే విషయాన్ని ఆచరించి చూపించాడు. వీటిలో పితృవాక్య పరిపాలన ప్రధానంగా వెలుగుతున్నది.

## విశేష ధర్మం:

లక్ష్మణుడు విశేష ధర్మాన్ని ఆచరించి చూపించాడు. అది ఏమంటే, భగవానునకు ఈ జీవుడు శేషభూతుడు అనే వాస్తవాన్ని తగినట్లు "**ఒழிవిల్ కాలమెల్లామ్ ఉడనాయ్ మన్ని ఒழிవిలా అడిమై శెయ్యవేండుమ్ నామ్**" (మనమే విచ్ఛేదం లేని కాలం అంతా భగవంతుని వెంట ఉండి నిరంతరాయంగా సేవను చేయాలి) అని నమ్మాழ்వార్ పలికినట్లుగా సర్వ దేశ సర్వకాల సర్వ అవస్థలకు తగినట్లు అన్ని విధాలైన సేవలను అతడు ఒక్కడే దివ్య దంపతులకు చేయాలని ఆశపడి, శ్రీరాముడు, సీతాదేవి అనే దివ్యదంపతుల వెంట ఉండి, తన వర్ణానికి తగిన ధర్మాన్ని, ఆశ్రమానికి తగిన ధర్మాన్ని వదలిపెట్టి,

భగవంతునకు సేవ చేయడమే, అంటే, దాస్యమే ప్రధానంగా కలిగి ఉన్నాడు, లక్ష్మణుడు.

## విశేష తరం:

ఇక భరతుడు అయితే, జీవుడు భగవంతునకు తానుగా ఇష్టపడి సేవ చేసి, దాసుడుగా ఉంటే చాలదు. భగవంతుడు ఆశపడిన సేవ అతని అధీనంలో ఉంటూ చేయడమే విశేషతరమైన సేవ అనే విషయాన్ని ఆచరించి చూపించాడు. శ్రీరాముని విడిచి ఉండడం అనేది భరతునకు అగ్నిలో దూకడం వంటిది, సముద్రంలో మునిగిపోవడం వంటిదే అయినా, అది శ్రీరాముని ఆజ్ఞ కనుక, ఆ స్వామి పై ఉండే భక్తికి తగినట్లు, అతనిని విడిచి ఉండడం సాధ్యం కానిది అయినా, అతని మాటను కాదనలేక 14 సంవత్సరాల పాటు విడిచి ఉన్నాడు. తపోవేషంతో ఒంటరిగా వాసం చేసి అతని రాకకోసం ఎదురు చూశాడు. కన్నీరుమున్నీరుగా విలపిస్తూ రాముని కోసమే ఎదురుతెన్నులు చూశాడు. భగవంతునకు పరతంత్రుడై ఉండడమే జీవుని స్వరూపం అనే విషయాన్ని తన జీవితంలో స్పష్టంగా భరతుడు ఆచరించి చూపించాడు.

## విశేష తమం:

భగవంతునకు దాస్యం చేయడం కంటే, పరతంత్రుడై ఉండడం కంటే, భగవత్ భక్తులైన భాగవతుల విషయంలో వారు ఆనందించే రీతిలో నడవడం చాలా చాలా ఉత్తమం. భాగవత పారతంత్ర్యమే జీవుని నిష్కృష్ట స్వరూపం. ఈ ధర్మాన్ని శత్రుఘ్నుడు భరతునకు అధీనుడై, అతని ఇష్ట ప్రకారం నడవడం ద్వారా చూపించాడు.

వీరివలె భగవంతునకు అనురూపంగా ఆ స్వామిని అనుసరించి అవతరించే లక్ష్మీదేవి కూడా సీతగా ఆవిర్భవించి, తనకే తగిన పురుషకారస్వభావాన్ని మాత్రమే కాక, లోకంలోని వారు అందరూ గ్రహించి బాగుపడేది రీతిలో, పతివ్రతా ధర్మాన్ని చాలా గొప్పగా ఆచరించి చూపించింది.

ఈ గ్రంథంలో ఇంతకు ముందు రెండు భాగాలలో సీతాదేవి పురుషకార వైభవాన్ని రామాయణంలోని ప్రధానమైన అర్థంగా చూచాము. ఈ మూడవ భాగంలో లోకంలో స్త్రీ గా అవతరించినవారికి ఉజ్జీవనం కలిగే విధంగా ఆమె ఆచరించి చూపించిన పతివ్రతా ధర్మం ఎటువంటిదో ఇక గమనిద్దాం.

శ్రీరాముడు అరణ్యాలకు వెళ్ళేటప్పుడు సీతదగ్గరకు వచ్చి "నీవు అయోధ్యలోనే ఉండు. మామ గారికి, అత్తగారికి సేవ చేసుకో. భరతుడు చాలా మంచివాడు. నీకు ఏ లోటూ ఉండదు" అని అన్నాడు. అప్పుడు సీతాదేవి

"కిమిదం భాషసే రామ వాక్యం లఘుతయా ధ్రువమ్,
త్వయా యదపహాస్యం మే కృతం నరవరోత్తమ!"

(రామచంద్రా! నీవు చెప్పిన మాటలను వింటే నాకు చాలా నవ్వు వస్తున్నది. చాలా తేలికగా నిశ్చయించి పలికావే ! నేను ఆ విధంగా ఏ దోషం చేశాను? ఈ విధంగా నన్ను దండిస్తున్నావు)

"ఆర్య పుత్ర! పితా మాతా భర్తా పుత్ర స్తథా స్నుషా,
స్వాని పుణ్యాని భుంజానా స్వం స్వం భాగ్యముపాసతే,
భర్తుః భాగ్యం తు నార్యేకా ప్రాప్నోతి పురుషర్షభ!,
అతశ్చైవాహమాదిష్టా వనే వస్తవ్యమిత్యపి"

(తండ్రి, తల్లి, సోదరుడు, పుత్రుడు, మేన కోడలు అని ఈ విధంగా ఉండే బంధువులందరూ వారు వారు చేసిన కర్మల ఫలాన్ని అనుభవిస్తారు. కాని భార్య ఒక్కతె మాత్రం తన భర్త కర్మఫలంలో, సుఖదుఃఖాలలో పాలు పంచుకుంటుంది. అందువల్ల భార్యను భర్త శరీరంలో ఒక భాగమని శాస్త్రం తెలుపుతున్నది. నీ తండ్రి నిన్ను అరణ్యాలకు పొమ్మని నియమించినపుడే ఆ ఆజ్ఞలో నాకు కూడా భాగం ఉన్నది.)

"న పితా నాత్మజో నాత్మా న మాతా న సఖీజనః,
ఇహ ప్రేత్య చ నారీణాం పతిరేకో గతిస్సదా"

(స్త్రీలకు ఈ లోకంలో, పరలోకంలో భర్త ఒక్కడే గతి. తండ్రి, తల్లి, పిల్లలు, చెలికత్తెలు, చివరకు తనకు తాను కూడా గతి కాదు)

"ప్రాసాదాగ్రైః విమానైర్వా వైహాయసగతేన వా,
సర్వావస్థాగతా భర్తుః పాదచ్ఛాయా విశిష్యతే"

(భర్తను విడిచి పెట్టి స్త్రీ ఎటువంటి సుఖాలను అనుభవించినా ప్రయోజనం లేదు. భవనాలలో నివసించినప్పటికీ, గొప్ప ఆనందాన్ని పొందినప్పటికీ ఏ ప్రయోజనం లేదు. భర్తతో ఉండడమే పరమసుఖం, అతని పాదసేవనం చేయడమే గొప్ప ధర్మం .

"అంతపురంలో సుఖంగా ఉండు" అని రాముడు చెప్పిన మాటకు బదులుగా సీత పలికిన మాట ఈ విధంగా ఉన్నది.

"సహ త్వయా గమిష్యామి వనమద్య న సంశయః,
నాహం శక్యా మహాభాగ నివర్తయితుముద్యతా"

(నీతో పాటు ఇప్పుడే అరణ్యాలకు నేను వస్తాను. ఇందులో ఏ సందేహం వద్దు. నేను నిన్ను విడిచి నివసించలేను) అని అంటూ సీతాదేవి రాముని మాటను స్పష్టంగా నిరాకరించింది.

ఈమాటను వినగానే రాముడు అరణ్యనివాసంలో ఉండే కష్టాలను ఆమెకు వివరించి చెప్పాడు. "అక్కడ మనిషి సంచారం ఉండదు. వనంలో నివసించడం చాలా విధాలైన కష్టాలకు కారణం అవుతుంది. పులులు, సింహాలు ఇంకా అనేక క్రూర మృగాలు అక్కడ నిండుగా ఉంటాయి. భుజించడానికి చక్కని ఆహారంగాని, తాగడానికి మంచి నీరుగాని దొరకదు. సుఖంగా శయనించడానికి పడక ఉండదు. ఈ విధమైన కష్టాలను ఏనాడూ నీవు అనుభవించి తెలియవు. జనకుని ఇంటిలో సుఖంగా పెరిగిన నీవు ఈ కష్టాలను ఏ విధంగా భరించగలవు?" అని రాముడు అన్నాడు.

## సీత సమాధానం:

అరణ్యంలో ఎదురయ్యే కష్టాలను తెలిపిన రాముని, సీతాదేవి వేళాకోళం చేస్తూ ఈ విధంగా అన్నది.

"కిం త్వా మన్యత వైదేహః పితా మే మిథిలాధిపః,
రామ! జామాతరం ప్రాప్య స్త్రియం పురుషవిగ్రహమ్"

("రామా! నీవు నిజంగా మగవాడివేనా? నీవు ఈ విధంగా చెప్పడం వింటే నా తండ్రి ఏమని అనుకుంటాడు? 'రాముని అల్లునిగా పొందాను. మగ వేషంలో వచ్చిన ఒక ఆడదానికి కదా నేను నా కుమార్తెను ఇచ్చాను'- అని కదా అనుకుంటాడు? భర్తకు దూరమై ఉత్తమ జాతి స్త్రీ ప్రాణాలతో ఉండలేదు-అనే ఈ మాటను నీవే చెప్పగా నేను పూర్వం విన్నాను" అని అన్నది.

"పితా రక్షతి కౌమోరే భర్తా రక్షతి యౌవనే

పుత్రా రక్షంతి వార్ధక్యే న స్త్రీ స్వాతంత్ర్రమర్హతి"

(ఆడదిగా పుట్టినదానికి ఏ సమయంలోనూ స్వాతంత్ర్యం లేదు. చిన్నతనంలో తండ్రి రక్షిస్తాడు. యవ్వనంలో భర్త రక్షిస్తాడు. వార్ధక్యంలో పుత్రులు రక్షిస్తారు)

“శుద్ధాత్మన్ ప్రేమభావాద్ధి భవిష్యామి న సంశయః,
భర్తార మనుగచ్ఛంతీ భర్తా హి మమ దైవతమ్"

(స్త్రీలకు భర్తయే గొప్ప దైవం. అందువల్ల భర్తకు సంతోషంగా సేవ చేసి పాపం లేనిది అవుతున్నది. అందుచేత నేను అరణ్యానికి నీతో పాటు వచ్చి నీకు సేవ చేసి పాపం లేనిదానినిగా కావాలని అనుకుంటున్నాను. ఈ విషయంలో నీవు అసూయను కలిగినవాడివి కాదు. ఎందుచేత అంటే, నీవు శుద్ధమైన మనసు కలవాడవు కదా)

"భక్తాం పతివ్రతాం దీనాం మాం సమాం సుఖదుఃఖయోః,
నేతుమర్హసి కాకుత్ స్థ!సమానసుఖదుఃఖినామ్,
య స్త్వయా సహ స స్వర్గో నిరయో యస్త్వయా వినా,
ఇతి జానన్ పరాం ప్రీతింగచ్ఛ రామ మయా సహ"

(నీ భక్తురాలను, పతివ్రతను, దీనురాలను, సుఖదుఃఖాలను సమానంగా భావించే దానను కదా, నేను. భర్తతో నివసిస్తే స్త్రీలకు అది అరణ్యం అయినా స్వర్గమే. భర్తకు దూరమైతే ఏదైనా అది నరకమే. దీనిని నీవు తెలుసుకొని నీతో పాటు నన్ను వనానికి పిలుచుకొని పో) అని సీత పలికింది. ఈ విధంగా చాలా విధాలుగా సీత వాదించగా, ఆమె మాటలకు రాముడు అంగీకరించి చిరునవ్వు నవ్వాడు. తనతో పాటు ఆమెను అరణ్యాలకు తీసుకొని వెళ్ళడానికి సమ్మతించాడు.

# అనసూయ దగ్గర:

అత్రి మహర్షి ధర్మపత్ని అనసూయ. ఆమె మహాపతివ్రత. గొప్ప తపస్సును కలిగినది. భర్తకు సేవ చేయడంలో తల పండినది. నారబట్టలను కట్టుకొని భర్తతోపాటు అరణ్యాలకు వచ్చిన సీతకు ఉన్నతమైన పట్టు వస్త్రాలను కట్టింది. పలు విధాలైన ఆభరణాలు అలంకరించి, వాడని పూలను ముడిచి, సువాసన తగ్గని చందనాన్ని పూసి, ఆశీర్వదించింది. ఆ సందర్భంలో సీతాదేవితో ఆమె ఈ విధంగా అన్నది.

"త్యక్త్వా జ్ఞాతిజనం సీతే మానసమృద్ధిం న భామిని,
అవరుద్ధం వనే రామం దిష్ట్యా త్వమనుగచ్ఛసి,
నగరస్థో వనస్థో వా పాపో వా యది వా శుభః,
యాసాం స్త్రీణాం ప్రియో భర్తా తాసాం లోకే మహోదయః"

("సీతాదేవీ! నీవు నీ బంధువులను, నీ సంపదను అంతటినీ విడచిపెట్టి రామునితో వనాకి రావడం దైవ సంకల్పం వల్ల జరిగింది. భర్త నగరంలో ఉన్నా , లేక, వనంలో ఉన్నా, అతడు మంచివాడైనా, లేక, చెడ్డ వాడైనా, అతడే దైవం. వారికి మంచి గతిని కలిగించేవాడు అతడే" అని అంటూ సీతాదేవికి అనసూయ పలు విధాలుగా భర్త యొక్క గొప్పతనాన్ని తెలియజేసింది. "శ్రీ రాముని విషయంలో నీవు ఈ విధంగానే అనుకూలంగా ఉండు" అన్నది. ఈ మాటలను విని సీత సిగ్గుపడి ఈ విధంగా అన్నది:

"నైతదాశ్చర్యమార్యాయాః యన్మాం త్వమభిభాషసే,
విదితం తు మమాప్యేతత్ యథా నార్యాః పతిర్గురుః"

(స్త్రీలకు భర్తే దైవం అనే విషయం తెలిసినదే. అయినా, మహానుభావురాల వైన నీ నోటి నుండి ఈ మాట రావడం తగినదే).

ఆమె అక్కడ పలికే బదులులో సారమైన అర్థం ఏమంటే– "నాకు శ్రీరాముని విషయంలో సహజంగానే ప్రీతి ఉన్నది. రాముడైతే తన అందంతో, గుణాలతో "**పుంసాం దృష్టి చిత్తాపహారిణమ్**" అనే విధంగా అందరి కన్నులను, మనసును అపహరించగలిగినవాడు, అందరినీ స్వాధీనం చేసుకొనే అతని విషయంలో నేను ప్రీతిని కలిగి ఉండడానికి కారణం నాకు సహజంగా ఉండే సంబంధమే-అనేది  వ్యక్తం చేయకుండానే తెలుస్తుంది. రాముడు గుణం లేనివాడై, అందం లేనివాడై ఉంటే అతని విషయంలో నాకు ఎల్లప్పుడూ ఉండే సహజమైన ప్రేమ అసహజమైనదని స్పష్టంగా వ్యక్తం చేయడానికి వీలవుతుంద. కానీ అతని అందం నాకు ఆ అవకాశాన్ని ఇవ్వలేదు. ఏం చేయను?" అనేది సీతాదేవి వచనాలలోని సారం.

## రెండు విధాలైన దాస్యాలు:

దాస్యమనేది రెండు విధాలుగా ఉంటుంది. స్వరూప కృత దాస్యం, గుణాత్మక దాస్యం అనేవి ఆ రెండు. ఈ రెండు విధాలైన దాస్యాలలో స్వరూప కృత దాస్యమే గొప్పది. అటువంటి దాస్యం తనకు రాముని విషయంలో ఉన్నది అనే విషయాన్ని తెలియ చేయలేని దశలోనే తాను ఉండడాన్ని అనసూయకు సీతాదేవి ఒక విధంగా తెలియజేసింది.

## రాక్షస స్త్రీల విషయం:

అశోకవనంలో చెరలో ఉండే సీతాదేవి ఏకాక్షి, ఏక కర్ణిక మొదలైన ఏడు వందల మంది, ఘోరమైన రూపాన్ని కల రాక్షస స్త్రీల మధ్య చిక్కుకొని బాధపడుతున్నది. రాముని తక్కువతనాన్ని, రావణుని గొప్పతనాన్ని తెలియజేస్తూ సీతను భయపెట్టారు. రావణుని మాటకు అంగీకరించేటట్లు సీతాదేవిని

రాక్షస స్త్రీలు బలవంతం చేశారు. వారికి అప్పుడు సీతాదేవి ఈ విధంగా బదులు పలికింది.

"దీనో వా రాజ్యహీనో వా యో మే భర్తా స మే గురుః,
తం నిత్యమనుగంతాస్మి యథా సూర్యం సువర్చలా,
యథా శచీ మహాభాగా శక్రం సముపతిష్ఠతి,
అరుంధతీ వశిష్ఠం చ రోహిణీ శశినం యథా,
లోపాముద్రా యథాగస్త్యం సుకన్యా చ్యవనం యథా,
సావిత్రీ సత్యవంతం చ కపిలం శ్రీమతిర్యథా,
సౌదాసం మదయంతీ చ కేశినీ సగరం యథా, నైషధం
దమయంతీ చ భైమీ పతిమనువ్రతా,
యథాహమిక్ష్వాకునాథం రామం పతిమనువ్రతా"

(నా భర్త తక్కువదనాన్ని పొంది ఉండవచ్చు. రాజ్యాన్ని పోగొట్టుకొని ఉండవచ్చు. ఏమైనా కానీ, అతడు ఏ విధంగా ఉన్నా, సువర్చల-సూర్యుని వలె నేను రాముని విడువను. మహా భాగ్యవతి అయిన సతీదేవి ఇంద్రుని విడువదు. అరుంధతి వశిష్ఠుని విడువదు. రోహిణి చంద్రుని అనుసరిస్తుంది. లోపాముద్ర అగస్త్య మహర్షిని విడువదు. సుకన్య చ్యవనహర్షిని విడువదు. సావిత్రీదేవి సత్యవంతుని విడువదు. శ్రీమతి కపిలుని విడువదు. మదయంతి సౌదాసుని విడువదు. దమయంతి నలుని విడువదు. ఆ విధంగానే ఇక్ష్వాకు కులనాథుడైన రాముని నేను విడువను" అని అంటూ సోదాహరణంగా సీతాదేవి తన మనోనిశ్చయాన్ని తెలిపింది .

## హనుమంతుని విషయం:

రాక్షస స్త్రీల మధ్య చిక్కుకున్న సీతాదేవి పడే బాధలను అన్నిటిని హనుమంతుడు శింశుపావృక్షంపై ఉండి సాక్షాత్తుగా చూచాడు. చెరలో ఉంటూ రాముని వియోగాన్ని సహించలేక తన ప్రాణాలను విడిచిపెట్టాలని సీతాదేవి నిశ్చయించుకున్నది. ఆ స్థితిని చూచిన హనుమంతుడు ఆమెను తానే రాముని దగ్గరకు

తీసుకుని వెళ్లాలని అనుకున్నాడు. ఆ విషయమే సీతతో చెప్పాడు. కానీ సీత సమ్మతించలేదు.

"భర్తుః భక్తిం పురస్కృత్య రామాదన్యస్య వానర,
నాహం స్ప్రష్టుం స్వతో గాత్రమిచ్ఛేయం వానరోత్తమ,
యదహం గాత్రసంస్పర్శం రావణస్య బలాద్గతా,
అనీశా కిం కరిష్యామి వినాథా వివశా సతీ,
యది రామో దశగ్రీవ మిహ హత్వా సబాంధవమ్,
మామితో గృహ్య గచ్ఛేత తత్తస్య సదృశం భవేత్"

(ఉత్తమ వానరా! నా ఈ శరీరం రామునకు మాత్రమే చెందినది. దీనితో నాకు నేనుగా ఎవరినీ తాకను. రావణుడు నన్ను తాకడం అనేది నా ఇష్టంతో జరగలేదు. బలవంతంగా తీసుకొని పోబడే, ఏమి చేయలేని స్థితిలో నన్ను అతడు తాకడం నా ఇష్టంతో జరగలేదు. రక్షించేవారు లేని దానను, నా స్వాధీనం లో లేని దానను అయిన నేను ఆ సమయంలో ఏమి చేయగలను? శ్రీరాముడు ఇక్కడకు వచ్చి పది తలల రావణుని అతని బంధువులతోపాటుగా చంపి నన్ను తీసుకునిపోవడం అనేది తగినది. లేకపోతే, "సీతను ఒక రాక్షసుడు తీసుకొని పోయాడు. ఒక వానరం ఆమెను రక్షించి అతని దగ్గరకు చేర్చింది" అని కదా లోకం అటుంది. నా భర్త అయిన రాముని కీర్తికి లోటును, అతని గొప్పతనానికి తక్కువదనాన్ని కలిగించి నా ప్రాణాలను నేను రక్షించుకోవాలని అనుకోవడం లేదు అని సీత హనుమంతునితో పలికింది.

సీత సూక్తులు మరికొన్ని మనకు ఇటువంటి దశ కలగడానికి కారణాన్ని హనుమంతునితో గీత తెలిపే సందర్భంలో ఈ విధంగా అన్నది.

మమైవ దుష్కృతంకించిత్ మహదస్తి న సంశయః,
సమర్థావపితౌ యన్మాం నావేక్షేతే పరంతపౌ"

("రామలక్ష్మణులు శత్రువులను జయించ గలిగినవారు. అయినా, వారు నన్నురక్షించకుండా ఉన్నారు అంటే, దానికి నేను చేసిన గొప్ప పాపం కారణం. అందులో సందేహం లేదు" అని సీత హనుమంతునితో పలికింది. సీత పాపం లేనిది-అనే మాట నిజం. అయినా, ఆమె తనపై ఆరోపించుకొని చెప్పిన రెండు అపరాధాలు లోకాన్ని హెచ్చరించడం కోసమే.

వాటిలో మొదటి అపచారం –"**సాక్షాత్ మన్మథమన్మథః**" అని చెప్పదగిన గొప్ప అందాన్ని కలిగిన శ్రీరాముడు దగ్గర ఉండగా, "**ఎన్ అముదినై క్కండ కణ్ గళ్ మట్రొన్ఱినై క్కాణావే**" (అమృత స్వరూపుడైన నా స్వామిని చూసిన నా కన్నులు ఇంకొక వస్తువును దేనిని చూడవు) అని ఉండవలసి ఉండగా, ఆ విధంగా కాకుండా, నేను ఒక బంగారు లేడిని చూసి దానిని కావాలని కోరడం ఒక పాపం. ఇంకొక పాపం ఏమంటే–పరమ భాగవతోత్తముడైన లక్ష్మణుని నోటికి వచ్చినట్లు అనరాని మాటలని దూషించాను. ఇది చాలా పెద్ద పాపం. ఈ భాగవతాపచార ఫలమే నేను ఇప్పుడు వెనువెంటనే అనుభవిస్తున్నాను. శ్రీరాముడు సముద్రానికి ఆ వైపు, నేను ఈ వైపు ఉండి బాధపడుతున్నాము–అని అన్నది.

లోకంలో స్త్రీలు సాధారణంగా మిగిలిన పెద్దలకు నమస్కరిస్తారు. తన భర్తకు భార్య నమస్కరించాలి అనే విషయాన్ని సీతాదేవి ఉదాహరిస్తూ "హనుమన్! మేము అరణ్యాలకు పోయేటప్పుడు, రాముడు, లక్ష్మణుడు, రామ పాదుకలు, నేను అనే నలుగురం వెళ్ళాము. లక్ష్మణుడు ప్రతి దినం రామునకు నమస్కరించాడు. అందువల్ల ఇప్పుడు అతడు రాముని విడవకుండా అతని వెంటనే ఉండి అన్ని సేవలను చేసి

ఉజ్జీవిస్తున్నాడు. ఇక పాదుకలయితే, రాముని చరణాలను ఏ సమయాల్లోనూ విడువకుండా ఉండే అదృష్టాన్ని పొందింది. అందువల్ల అది ఇప్పుడు అయోధ్యా రాజ్యాన్ని పాలిస్తున్నది. దశరథుడు కోరినట్లు రాముడు కానీ, కైకేయి కోరినట్లు భరతుడు కానీ రాజ్యాన్ని పాలించలేదు. పాదుకలే రాజ్యాన్ని పాలిస్తున్నాయి. నేను పట్టమహిషి అనే గర్వం తో రామునకు నమస్కరించకుండా అతనిని అనుసరించాను. ఇదిగో! దాని ఫలంగా ఆ స్వామికి దూరమై చాలా బాధపడుతున్నాను. నీవు తిరిగి వెళ్లేటప్పుడు నా తరపున నీవు రామునకు నమస్కరించి నా నమస్కారాలను తెలియజేయాలి. అప్పుడే నాకు ఈ బాధలనుండి విముక్తి కలుగుతుంది–అని సీత అన్నది.

కొన్ని సమయాలలో స్త్రీలు తమ భర్తలకు తగిన ఆలోచనను కలిగిస్తారు-అనే విషయానికి ఈ క్రింది సందర్భాన్ని ఉదాహరణగా గ్రహించవచ్చు. దండకారణ్యంలోకి రాముడు ప్రవేశించగానే అక్కడ ఉండే మహర్షులు అందరూ కలసి రాముని దగ్గరకు వచ్చి తాము రాక్షసుల వల్ల పడే బాధలను వివరించి చెప్పారు. "రామా! ఇదిగో చూడు! మా శరీరాలను ఈ రాక్షసులు ఎంతగా బాధ పెడుతున్నారో గమనించు. ఇదిగో చేతికి గాయం. ఇదిగో కాలికి గాయం" అంటూ పలు విధాలుగా తాము పడే కష్టాలను వివరించారు. తమ శరీరాలకు ఏర్పడిన గాయాలను చూపించారు.

అప్పుడు రాముడు వారి స్థితిని సూచి జాలిపడి "మిమ్ములను రక్షిస్తాను, రాక్షసులను వధించి తీరుతాను" అని వారికి మాట ఇచ్చాడు. ఆ తర్వాత చేతితో ధనుర్బాణాలు ధరించి అడవిలో తిరుగడం ఆరంభించాడు. రాముడు ఆ విధంగా ధనుర్బాణాలు ధరించి అరణ్యంలో సంచరించడం గమనించిన సీత రామునకు రాక్షసులతో వైరం తప్పక కలుగుతుంది-అని

భయపడింది. దానివల్ల పలు ప్రమాదాలు వస్తాయని భావించింది. వాటిని నిరోధించడం కోసం రామునితో చాలా సున్నితంగా ఈ విధంగా పలికింది. రామా, నీ తండ్రి మాటను పరిపాలించడం కోసం నీవు ముని వేషాన్ని ధరించి వనానికి వచ్చావు. నీ వేషానికి తగినట్లు కదా నీవు సంచరించాలి.

త్రీణ్యేవ వ్యసనాన్యత్ర కామజాని భవంత్యుత,
మిథ్యావాక్యం గురుతరం తస్మద్గురుతరా వుభౌ,
పరదారాభిగమనం వినా వైరం చ రౌద్రతా"

(ఈ లోకంలో మూడు విధాలైన వ్యసనాలు ఉన్నాయి. అసత్యాన్ని పలకడం చాలా పాపం. అంతకంటే ఇతరుల భార్యలను ఆశించడం, ఆ విధంగానే, విరోధం లేకుండా ఒకరిని హింసించడం అనే ఈ రెండూ పెద్ద వ్యసనాలు. "**రామో ద్విర్నాభిభాషతే**"–రాముడు రెండు మాటలను పలకడు–అనే విషయం అందరికీ తెలిసినదే. నీవు అసత్యాన్ని పలుకవు. "**పరదారాశ్చ చక్షుర్భ్యామపి న పశ్యతి**"–రాముడు ఇతరుల భార్యలను కన్నెత్తి కూడా చూడడు. అందువల్ల నీవు అసత్యాన్ని పలుకుతావు,mఇతరుల భార్యలను కోరతావు అనే భయం లేదు. ఈ రెండు దోషాలు నీలో ఉండే అవకాశం లేదు. కానీ, ఇప్పుడు మూడవ దోషానికి అవకాశం కనిపిస్తున్నది.

"తృతీయం యదిదం రౌద్రం పర ప్రాణాభిహింసనమ్,
నిర్వైరం మోహాతత్చచ్చేత్తే సముపస్థితమ్"

(ఇతరుల ప్రాణాలను హింసించడం అనే మూడవ దోషం నీకిప్పుడు ఏర్పడనున్నది. ఋషుల పట్ల కరుణ కారణంగా ఏ విరోధం లేకుండా రాక్షసులతో వైరం పెట్టుకోవడం ద్వారా ఇది నీకు ఏర్పడుతున్నది. ఇది నీకు అనర్థాన్ని కలిగిస్తుందని భయపడుతున్నాను. అగ్నికి ఆజ్యం పోసినట్లు క్షత్రియునకు ఆయుధధారణం రౌద్రానికి కారణం అవుతుంది. రామా,

ఆయుధాలు ధరించడం అగ్నిని తాకడం వంటిది. ఈ విషయంలో ఆయుధధారణం నీకు ఉపద్రవం కలిగిస్తుందని భయపడుతున్నాను. నీకు బోధిస్తున్నాను–అని అనుకోవద్దు. గుర్తుకు తెస్తున్నాను అంతే.

"అగ్నిసంయోగవద్ధేతుః శస్త్రసంయోగ ఉచ్యతే,
స్నేహాచ్చ బహుమానాచ్చ స్మారయే త్వాం న శిక్షయే"

(నీవు ఇప్పుడు ముని వేషాన్ని ధరించావు. దానికి తగినట్లు కాకుండా విల్లును ధరించి విరోధం లేని వారిని వధించడం తగదు. ఆ ప్రయత్నాన్ని విడిచిపెట్టు) అని సీత రామునితో పలికింది.

రాక్షసుల వధకు తన వియోగమే కారణంగా చాలు–అని భావించే సీతాదేవితో రాముడు రాక్షసులు చేసిన దుష్ట చేష్టల కారణంగానే వారి వధ ఏర్పడుతుంది–అనే తన భావాన్ని ఒక విధంగా వ్యక్తం చేశాడు. "**యజ్ఞవిఘ్నకరం హన్యామ్**" (యజ్ఞాలకు అడ్డు కలిగించే వారిని వధిస్తాను) అని భగవంతుని వచనం. ఈ సందర్భంలో రాముడు పలికిన మాటలను చూద్దాం.

అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే సలక్ష్మణామ్,
న హి ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః"

("సీతా ! నేను నా ప్రాణాలను అయినా విడుస్తాను. 'ప్రాణేభ్యోపి గరీయసీ' అని నా ప్రాణాల కంటే మిక్కిలి ప్రియమైన నిన్ను కూడా విడుస్తాను. మన ఇద్దరి కంటే ప్రియమైన లక్ష్మణుని కూడా విడుస్తాను. కానీ బ్రాహ్మణులకు ఇచ్చిన మాటను నెరవేర్చి తీరతాను)

భక్తులను విడువని అచ్యుతుడు గదా భగవంతుడు.

సీతాదేవి చరిత్ర "సీతాయాః చరితం మహత్" అని రాముని చరిత్ర కంటే చాలా గొప్పది. "**మాతర్మైథిలి!**" అనే శ్లోకంలో భట్టర్ "**లఘుతరా రామస్య గోష్ఠీ కృతా**"–శ్రీ రాముని గోష్టి నీ గోష్టి వల్ల చిన్నది అయిపోయింది–అని, సీతాదేవి కరుణ చాలా అద్భుతమైనది అని అన్నారు. గ్రంథ విస్తరణకు భయపడి విషయం ఇంతటితో ముగించబడింది.

## సీతాచరితమ్ సంపూర్ణమ్

